వందిబహుమతులుపొందితనపత్నియగునళినీదేవింగాంచి ఓయింతీ, నీవు
నా వెంటవచ్చెదవా యిందుండి నీతండ్రిగారాబంబున పిల్లలతో గూడియా
డుచుపాడుచున్నావాయని యడిగిన భర్తంగాంచి నమస్కరించి ఓస్వామీ
తామియ్యిచ్చోటవదలిపోయినపిమ్మట నేనిందుండుటచే నేమిప్రయో
జనంబు నాతాపంబు నిమ్మళంబే; యౌవనము వృధాయగుచున్నదే; పాతివ్రత్య
మునకు భంగముగుచున్నదేగాన నేను తమవెంటనడచివచ్చుటకు సంది
యంబులేదు. గావున నన్నుగైకొనుమని నమస్కరించి నిలుచున్న తనప
త్నింగాంచి మిక్కిలి సంతోషముతో అంతరంగంబునుండి ఓ మానవతీ, నీవు
నా వెంబడివచ్చెదనని యనెదవు నేపోవునది అతి ఘోరమైన అరణ్యంబులే;
నీవుయుండునట్టి పట్టణము వలెయుండదే; అందుకేమిచేయుదువని యడిగిననది
అరణ్యంబు ఘోరమేయగుగాని భక్తిఘోరమగునా; ఓయింతీ, అట్టి అరణ్య
మున భక్తులకు వలయునవి యేమియు చిక్కవే, చిక్కినా చిక్కకున్నానరే
ఓ చెలీ, యేను పండుటాకులుతిని గాలిమ్రింగి నీళ్ళుత్రాగి కాయకసురుదిని
కాలంబు గడుపుచుందును నీవట్లుండ నోపుదువా, తామేఅన్నివిధముల
వోపిక గలిగియుండ నేనెంతమాత్రంబు. అబలా, పెదయరణ్యమున సింహ
ములు, పులులు, పందులు, యెలుగుగొడ్లు, యేనుగులు మొదలగుగొప్ప
మృగంబులును, గండభేరుండాదిబోకలు మొదలగుగొప్పపక్షిసమూహ
ములును, నాగ సార, చిలువ మొదలగు పెద్దసర్పంబులు నిండి నిబిడీకృతం
బైనవృక్షములచే చీకట్లుగ్రమ్మ లతలచేమూయబడిన భయంకరముగల
అరణ్యంబున నొకవైపున నూర్చుండి నాసనంబు నిశ్చింతగొని యీశ్వర
ధ్యానంబు మించి తపంబు గావింతు నెడనీవచ్చోటనొంటరివై యెట్లుందువు.
ఆహా ప్రాణనాథా, తాము ఇవన్నియు నెడజూపి నన్ను విడచిపోవలయునని
నెంచియుండుటచే నేమిప్రయోజనంబు? మీరేదిచెప్పినను విననా? అడవి
భయమైనను సరే? మృగంబులు మ్రింగిననుసరే? పక్షులుకీల్చిననుసరే?
సర్పంబులుగరచినాసరే? భుజించుటకు అన్నంబులేకపోయినాసరే? త్రా
గనునీళ్ళింకిపోయినాసరే? యెదియెట్లయినను సమ్మతమే? మిమ్ములవదలి
నిమిషమైనను అటు యిటు చెదరను ఇది నిజమని పలికిన ఇంతింగాంచి
ఓసీ, ఇంకొకటి చెప్పెదవినుము నేను పూజాపునస్కారంబులందు ఆశక్తి
గలవాడను అందుకువలయు పుష్పంబులు దెచ్చియిచ్చి పాత్రంబులు శుద్ధి

పఱచి నాకు వలయుపచర్యలుచేసి, రాత్రిళ్ళునిద్రమాని వైదికభోజ
నంబులు భుజించి మనుగులయందుపవళించి అంతజాగ్రతగాయుండుట
అది చాలాదుస్తరంబు నీవుపసిబాలవు నేనుముసలివాడను. నాతో నీకు
కామోపేతులుతీరవు. నేనెందుండోయుండినట్టే వెళ్ళేవాడను. అట్లు నే
పోయినపిమ్మట అరణ్యంబున యొంటరిగాయుల్లుందువు యిట్టిదురవస్థల
జెందుటకన్న యిప్పట్టణంబున తలితండ్రుల సమీపమున అతిగారాబంబున
సఖీజనమధ్యంబునను త్సాహంబుమీరి నందనవనంబున ఆడుచుపాడుచు
వేడ్కలలరుచుయుండుటలుమాని నావెంబడిన ఛ్ఛాదననిబలాత్కారంబు
చేయుట నీకుతగునా అందులకేమియని యడిగిన మగనింజూచి పతిని వి
డచియుండుయింతులకు వ్రతశీలు లేదని చెప్పరీతీ మిమ్ములనువిడచిమీకు
వ్రాడిగంబుచేయక పరమసార్థకంబు తెలియక సంసారమాంద్యమువదలి
లోకమాయలోమునిగి మత్తురాలైయుండుట యేమిప్రయోజనంబు హే
నాథా! లోకంబునందు జన్మంబులోమానుష్యజన్మంబు అతివుత్కృష్టం
బనియు చెప్పంబడియున్నది.

అంత స్త్రీయైజన్మించుట అతి పాపమనియు, దానికి మగడుతప్ప
యితరపరదైవంబులేదనియునదంతిగావునయింతినైన నేనుసుమతినయి
పతియందు భక్తియుశ్రద్ధయుగలిగిపతియేదైవమనియెంచి వారినామమే
తిరుమంత్రమని ధ్యానించివరించి రూపమేన్నికుయందునిలిపిసుశీలనై
పుట్టినింటికినిఅత్తయింటికినిఖ్యాతి దెప్పించి లోకమంతయు తనమేలు గ
ప్పించి గొప్పకీర్తివహించిపతియందు మొడ తెగనివ్రతమును ఎడబాయని
విశ్వాసమునుగల్గి మెలంగవలయును. ఉట్లుండి తాముమాత్రముఅడవికి
వెళ్లితపముగావించి ముక్తిబొందుటలు నాకుఅంతకన్నఫలముమీకుండ
నేనెట్లువదలియుందును. ఓనాథా! మునుపు శ్రీరాముడు అరణ్యమువెడలి
నప్పుడు సీత అతనివిడచి ఇంటనేయుండెనా, అడవికివెళ్లినహరిశ్చంద్రుని
చంద్రమతి వెంబడించలేదా; వనములుదిరిగిననలునితోడ దమయంతిఘో
రఅడవిలోతిరుగలేదా; కైలాసపతిహిమాద్రియందుతపముచేయబోయి
నప్పుడు పార్వతి యెడబాసియుండెనాయని మందలించినపలుకులు విని
ఆనందమునొంది నయ్యంతింగాంచి ఓ మందయానా! ఇప్పుడు నీవు నా

వెంబడివచ్చుటకు సమ్మతించి యున్నదానవుగావున నాయట్లె నీవున్నునా రచీరలుధరించి ప్రాపినగలుబెట్టుకొని జడలుదాల్చిమునిపత్నివై వెంబడియుండుమని యాజ్ఞాపించిన నంతనాయువతీరత్నము రత్నాభరణములు దీసి ప్రాపిభూషణములుధరించి జరీచీరలు విడబెట్టి నారచీరలుగట్టి జడబెట్టుకొని మునిపత్నియై మునివెంటనిలువగా నాతండు అతిసంతసంబంది ఆ మదవతింగూడి బహుదూరముచని గంగాతీరముగని అందుతపముగావించెదమని మంచిప్రదేశమునందు మనోరమ్యముగని అందునెలకొని తపమునకు తగునని యెంచి తనభార్యంగూడి తపంబు గావించుచుండెను.

అట్టితపసియగు తనభర్తకునలయుపచర్యలుతీర జేయుచు వారి మాటలకుమీఱి రాకయున్న తనపత్నింగాంచి దీని పాతివ్రత్యశీలత్వము నుపరీక్షించ యెన్నికగొని నమ్మౌని సురతక్రీడలయందు యెప్పుడును పాలుమాఱకయు సదా భక్తిపూర్వకంబుగాను మసలితనముచేతను చాల ముగదుపుచున్న నామునిశరీరమంతయు పెద్దరోగంబు దెచ్చుకొని ప్రణంబునచీముగార కండలు ప్రేలిపడ, పురుగులు ప్రాల, దుర్గంధంబుచాలనీవు దగ్గర జేరగూడనిగబ్బుతోను, అసహ్యముతోనుయున్న మగనింజూచి దుఃఖించి ఆహాదైవమా ఇది నాయదృష్టమా యనియేడ్చి తానే నూరార్చి మగనిశిరస్సుపై యెత్తిమోసికొని తటాకంబునకువెళ్లి స్నానము జేయించి తనచీర చెరుగుచే శరీరమాద్యంతంబు తడిమొత్త చీముదుడిచి తిన్నగ యెత్తియెప్పటియట్లనెత్తిపైబెట్టుకొని తమవిడిదికిగొని తెచ్చి అడవులదిరిగి కాయగనరుల దెచ్చి మగనికితినిపించి మిగిలిన శేషమును అసహ్యములేక తానుభుజించిశయ్యపై పరుండబెట్టి అతనికాళ్ళు మెల్లనయొత్తుచు నిద్రపుచ్చుచు అతనికికలకష్టంబులు తనవిగాభావించి వారికి బాసయందు బుద్ధిలోపనీయక హితవుపాడుచున్న తనపత్నింగాంచి ఆహా! ఇది చాలానుత్తమగుణశీల యనితలచి మఱియునాతముని తానుభుజించెడు పాత్రంబున తనపెద్దవ్రేలు తెగిపడునట్లుజేసెను ఆవ్రేలు వ్రేలాడుమాంసంబుతోనుఅతిదుర్గంధంబుతోను, పురుగులతోను, చీముతోను, రక్తముతోను, నానావిధ బీభత్సుగాపడెను అదిగాంచి నాయింతి ఆవ్రేలిని అటుపారవైచి ఆశేషాన్నమును తానుఅసహ్యమనితలచక నెమ్మదిగైకొని భుజించినదిగాంచి మునిశ్రేష్ఠుని మనంబు నెమ్మదిగొని ఇంతాపాహాషెద

మని నాయింతిని కాళ్ళతోదన్ని, మొండిచేతులచేగొట్టుటయు,కన్నట్టు దిట్టుటయు మొదలగువిపరీతంబులను చేయుచున్న తనభర్తయందు రోయింపులేక నెపంబులెంచక సంతోషంబుమిన్నక విశేషపుపచర్యలొందే లుచు విశ్వాసంబులు మించుచుయుండెను

ఇట్లుచేయుచున్న తనపత్నియగు నళినియనున్యంజూచి ఓసీ! నిర్భాగ్యురాలా! నీవెంత పాపిరో నేనెరుగను నాశరీరంబుపతినన్నెబంగారంబురీతి నుతికెక్కిన అందంబుతోడచిందులువేయుచున్నదిమానిరోగంబులుబలిసి ఆ వయవంబులుస్వాధీనంబుతప్పి నడలుమొండై అటుయిటు చనుటకశక్తుడై యేమియుండోచక జేసిన నీవివాహంబు యెంతావహంబు. ఓసీనికృష్టవతీ! నిన్నంటవచ్చినయారోగంబు యెట్లుపోవును. నేనేమిసేయుకును యూరకుండక నిన్నేలపెండ్లాడితిని. అయ్యోయిది నాగ్రహచారమా,నాకు బ్రహ్మయిట్లనివ్రాసియుండెనేమో నేనెరుగనైతినేయని పలువిధంబుగా దూషించుచున్న మగనికాళ్ళపైబడి నమస్కరించి అయ్యోస్వామి నేనేమిచేయగలను నావల్లఅయినంతశరీరకష్టంబుచేయగలను వానివ్యాధినూన్నపగునా నన్ను మీరుయేవిధంబుగ బల్కినా యేమిచేసినామీరుగాని నాకు వేరెవరున్నారు? గావునతాముయెందెందుయేగనిచ్చయున్నదో ఆయూచోట్ల దెచ్చదగేని యేను భయభక్తిశ్రద్ధలతో అచ్చోటికెత్తుకపోయెదనని చెప్పిన మాటలువిని మనస్సునసంతసంబంది నానుదతింగాంచి నిర్భాగ్యులారా! నీవు నన్నుయీఖండంబునంగల యెల్లపుణ్యతీర్థంబుల కెత్తుకపోయి అందు మజ్జనంబుగావించి తెమ్మని చెప్పినవిని అట్లే తనభర్తను భయంబుతోయెత్తి నెత్తిమీదయుంచుకొని రక్తంబులుగాగ చీములూలుక మాంసంబులుబడ దుర్గంధంబులు వీవ నీమె రోయింపులేక గొనిపోయెను. అట్లుపోగా చీకటిగ్రమ్మవచ్చెను అంత నొకపట్టణంబుగని అందునివసించిపోదమని ఆపురంబు జొచ్చి వూరేగి యున్నమగుచెచ్చిమగనికిణినిపించివాగిలిన శేషాన్నంబు తానుభుజించిశయ్య చేర్చియున్నసమయంబున నాతడుఖిన్నుడై ముఖంబుగ్రేలవేసి జింతనొంది యున్నమగనింగాంచి ఓస్వామీ! తామేమి జింతగొనియున్నారు. నేచేసిన యపరాధమేమియనియడిగె. అందులకాతడు చిన్నదానా,నీవడిగినందున నేమిప్రయోజనంబు నాకోర్కెలీడేర్చపోయెదవాయని జెప్పినమాటలు

తనశయనగృహంబున యింద్రభోగంబునకు సమమైన భోగావతంసంబ
గుహంసతల్పంబు శృంగారించి కీల్బొమ్మలచే చామరసురటీలువీవ పల్లె
రంబున హారతులు వెలుగ తాంబూలంబునకర్పూరపేడంబులు మగుడింప
నిండుమనంబున హాసవదనంబుతో సతిని శయ్యపై జేర్చి దృష్టితీసిముద్దిడికౌగ
లించి లాలించి ఆహా ఓరి మన్మథుడా నీకుట్టిరూప మిదివరలో నేనెందు
గాననైతిని నాయదృష్టఫలమున బలాత్కారముననియింతటిరూపవంతుని
పొందుచున్నాను నేనెంత పుణ్యంబుచేసితినో యనిబల్కి నాదివ్యపురు
షుంగాంచి అయ్యో యింతటి తేజస్వియగు నిన్ను కష్టరోగియనిబల్కినీ భా
ర్యకు మనసెట్లువచ్చెను అయినయింతటిజాణగాని నా చేతికొప్పించి దాని
మనసెట్లనెమ్మదించియున్నది దానిప్రాణమున్న అదిఅనుభవించు
సుధామృతంబు నాచేతికొప్పగించి నన్ను తృప్తిపరచిన ఆయింతికి నేనే
మిప్రతిఉపకారంబు చేయబోవుచున్నానని బల్కిన యింతింజూచి మవునిచి
రునగవ్వునవ్వి యోబాలికా నీవిప్పుడు నన్నుజూచుచున్న యీరహస్యము
నుయెవరికి చెప్పవలదు నేనొక కారణమునుబట్టి యిట్టిరూపంబుల నా
భార్యకంటికిమాత్రముకనుపడుచున్నానేగాని మరినేనులేను అట్లునీవు చెప్పి
తివేని నీతలసహస్రవక్కలగునని భయముజూపి నారాత్రంతయు దాని
గూడి మన్మథావేశంబుదీరి తెల్లవారగనే వాకిటవద్దచేరి మునుపటియ
ట్లముసలివాడై రోగంబుమీరి హీనధ్వనితో తలుపుదీసి భార్యనుపిలువ
గానే స్వామీ యిదిగోవచ్చితి హాజరైయున్నానని అతి జాగ్రతగవచ్చి
భర్తనెత్తి గంపలోబెట్టుకొని నెత్తినమోసి తనచోటికేగెను.

ఇట్లు పూరెల్ల దిరుగుచుయుండు దినంబులందు నాపురంబున
అధికారియును రాజు న్యాయాన్యాయంబులు గుర్తెరుగక కారణంబు
తెలియక విచారణలేక మాండవ్యమహామునియను పుణ్యాత్ముని వుక్కు
స్తంభమునాటించి అందులో వీరిదగిలించియుండిరి. వారు స్తంభమున
తగులుపడి ప్రాణముపోలేక యుండునపుడు యీపతివ్రతాశిఖామణి నా
పురముగుండా పోవుచున్నపుడు చీకటిక్రమ్మి పట్టంబుగ మేఘముగమ్మి
పురుషులు మెరుములతో వర్షించ మార్గంబు తెలియక నాపతివ్రతతలయం
దు గంపయుంచుకొనిపోవుచున్నపుడు వ్రేలాడుచున్న మాండవ్యమహా
మునిపాదంబులు యీబిడ్డ తలయందున్న గంపకుతగలగా నాతనికి స్తం

భంబువల్లవుపద్రవంబు అధికమాయెను అప్పుడుమాండవ్యుడుచూచి ఆహా యీసుమంతి యెంతమతి గలదియునికోపించి తెల్లవారగానే నీపుత్రాడు తెగిపోగాక యని శాపంబిడెను. అదివిని యీబిడ్డనికులాంగన యీతడు మహాత్ముడు గాబోలు మానము తెలియక చీకటిలో తత్తరబడి యీలాగు చేయనైతిమి మనయందేమియు తప్పిదంబులేకుండగా, యిట్టుండ మనలనేల శపించెనెను మంచిదికానిమ్ము నేను శుద్ధపతివ్రతనైతేని తెల్లవారకాదని ప్రతిశాపమిచ్చెను తట్లీగుపుడు జేసిన ప్రతిజ్ఞవల్ల యెనిమిదిరోజులు తెల్లవారక దిశలు తెలియక వానికి టచీకటి కమ్మియుండుటను గన్న దేవతలు మొదలుగాగల మానవులందరుభీతిల్లి యిదియెందుకొచ్చెనని తెలిసి మాండవ్యులవద్దకొచ్చి స్వామీ యీఆపదతీర్చుండని వేడిన వారు నాయందేమియు నేరంబులేదు ఋషిపత్నివద్ద పొండనినవారు యీ పతివ్రతారత్నంబునద్ద జేరిఅమ్మా త్రిమూర్తులు మొదలగు దేవతలందరున్నుదిశలు తెలియక తత్తరించెదము తెల్లవారునట్లు అనుజ్ఞ యువ్వవమ్మా యని వేడిననామె ఓయింద్రాదిప్రభువులారా, యిదేటిమాటలు నేనయి నా ప్రాణంబులుపోగొట్టుకొందునా ఈన్యాయముమీరెరుగరాయన అమ్మా లోకంబున కొకరికిపకారమైన యానేకులకు సుఖమయ్యెడు కార్యంబుచేయుటే న్యాయమని తెలియనే అందరునువచ్చియున్నారము గావుమమ్మా నికరుణరావమ్మాయనివేడిన దేవతలంగాంచి ఓహో యిదేటిమాటయింతులకు పతికన్నదైవంబు యిలగలదే అట్టిపతిని యెడబాసియుండుటకన్న జచ్చుట మంచిమతిగాదే నేను నాపతిని విడచియుండలేనని చెప్పినవిని దేవతలు మాండవ్యునిజూచి ఓస్వామీ తామైననుయీకష్టంబులును దేవతలగు మమ్ము కాపాడుమని వేడిన నాతడు నావల్లకానేరదు నాభార్యవలన కావలయుగాని మరెవరివలన కాచేరదనెను. దేవతలందరు గూడుకొని మాంగల్యాని కాడంబరచుకొని మహాపతివ్రతయగునళినీదేవినిందోడ్కొని మాండవ్యునిసమీపముజేరి యీయింతిమంగళసూత్రంబు నిరతంబుండునని ఆశీర్వచనంబులు బల్కుమనివేడిరి నంత నామాండవ్యుడు మనసుకరిగి ఓయింతీ నీవుసుమంగళివై దీర్ఘాయువున వెలసిల్లుమని శాపంబునివర్తించెను అంతట నాబిడ్డ మునుపటియట్ల వుదయాస్తమానంబులు గావుగాక ఋషిని విముక్తంబుజేసిన యంత తెల్లవారవచ్చెను, లోకులందరు దిశలు

తెలిసి తమతమ యోగయాగ హోమాది తర్పణంబులు జేసి సంధ్యలు మార్చిరి

అంత నమహాత్మ్యల్యనుహామునితనసుందరియగునళినీదేవింగాంచి ఓసహో యింతీ నీయంతటిపతివ్రత భక్తిశీలయగు యింతి నెందుంగాన నీకు గల కష్టంబులనియు దలంపక యోర్చి యున్న యోర్పు యెంత వెల గలను గావున నేను నీయిచ్చ నెరవేర్చెదను నేను కుష్ఠురోగిని గాను ముసలివాడనుగాను నీకోరికె దెలుపుమన నాయింతి నంతసించి ఓస్వామీ తాము నాయందు ప్రీతియుంచి ఐదురూపంబుగల నన్నుగూడి మరు కేళిసాడి సౌంఖ్యులమగు దుండవలయు యిదియుగాక నాకు మరుజన్మ మొచ్చెనేని తామే భర్తకావలయు యిదినాయభిప్రాయం బని వరంబులంది సుఖంబున పలుసంవత్సరంబులు సుఖం బనుభవించు చుండి దంపతు లిరువురు వైకుంఠపదవులందిరి. గావున యింతులు లోకంబున నళినీదేవి యుండిన పతివ్రతయు శుచియుశీలంబును భద్రం బును సత్యశౌచంబులుగలిగి ఖ్యాతులుజెంది పతివ్రతలని మెప్పించి మోక్షార్థమగు కార్యంబులుజేయుచు పతిభక్తిగలిగి మగడేదైవమనినమ్మి జరుగవలయునని యీపుణ్యకథవలన తెలియుచున్నది సకలార్థకము.

నళినీదేవిప్రభావము – ముగిసెను.

—◆—







శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## ౧౨. లోపాముద్రాదేవి ప్రభావము.

పూర్వకాలంబున విదర్భదేశాధీశ్వరుపుత్రికయగు లోపాముద్ర యను కన్యక మిక్కిలి చక్కనిదియు, సుగుణంబుల కాటపట్టయినదియు మిక్కిలి శాంతిశమదంబులుగలదియు భూతదయాపశ్చాత్తాపంబుగలదియు నీతిశాస్త్రవిశారదియు, ధర్మశాస్త్రవిచారిణియు, వేదవేదాంతార్థగోచరయునై యంతఃపురంబుననుండి పెద్దలవలన పతివ్రతాస్త్రీల ప్రభావంబు వినుచు తోడిచెలికత్తెలతో సత్కథావిశేషంబుల ప్రొద్దుపుచ్చుచుండెను.

ఇట్లుండగా నొకనాడా రాజసభకు కుంభసంభవుండగు అగస్త్య మహాముని వచ్చె. రాగాజూచి ప్రభువు సింహాసనముపైనుండి దిగి యెదురేగి యమ్మునీంద్రుం దోడ్కొనివచ్చి యుచితపీఠంబుపై గూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాది విధులం బూజించి కుశలం బడిగి మునికులచంద్రా! మీదర్శనంబున యీ దినము సుదినంబయ్యె. మాకు జన్మ పావనంబయ్యె. మా పాపంబు నశించె. మీ రిచ్చటికి వచ్చిన కార్యం బెట్టిదో యెరుంగింపుడు మా చేత సాధ్యమైనంత మట్టుకు మీ మనోద్దేశంబు నెరవేర్చెదనని పలికె. పలుకగా నేమునీంద్రుండు భూపాలా! నీవు సత్యవ్రతుండవనియు మిక్కిలి యుదారగుణములుగలవాడవనియు విని నిన్ను నే నొక్క విషయమును యాచింపవచ్చితిని నీవన్నమాట తప్పవలదు, అదేమనగా, నా పితృదేవతలొక్కదినము ప్రత్యక్షంబై అన్నా నీవిట్లు అనేకదినంబులనుండి వివాహంబునొల్లక బ్రహ్మచర్యాశ్రమమునం దేయుండుకతంబున మాకుం బుణ్యలోకంబు గలుగకున్నవి 'అపుత్రస్య గతిర్నాస్తి' యను వేదవాక్యముప్రకారము పుత్రులులేనివారికి సద్గతి గలుగనేరదు. వంశము లవిచ్ఛిన్నముగా నేడవతరమునందు పుత్రుడు పుట్టనిదిగాని మొదటితరము పురుషునికి పుణ్యలోకము కలుగదు. నీవు మాకేడవతరమువాడవు కావున వివాహంబొనర్చికొని

మమ్ముద్ధరింపుమని దీవించి యదృశ్యులైరి. అందుకై నేను వివాహంబు గావించికొని గృహస్థధర్మంబున నుండఁగోరి నీకూతును నడుగ వచ్చితి గనుక దానినిచ్చి పెండ్లిచేసివేసిన దొడ్డసుకృతంబు గలుగునని పలికె. పలుకగానే అట్టి మాటలా రాజు చెవులకు శూలంబులపోలికై మూర్ఛాక్రాంతుఁడై భూమింబడియె నంత మంత్రులు సామంతరాజులు నతనిమూర్ఛం దొలంగునటుల శైత్యోపచారంబు లొనర్చి పల్లకిలో నెత్తికూర్చుండబెట్టి యంతఃపురమునకుం గొనిపోయిరి

పిమ్మట నరేంద్రుఁడు మూర్ఛందేరి యాశ్చర్యపడి వింతి రా మంత్రి ప్రధానులారా! నిరుపేదయు వనవాసియు జడదాల్పరియు నుక్కిలి కృశీభూతుండును గుయీబకుఁగు బాపడెక్కడ? నాముద్దుల బిడ్డ యెక్కడ? నక్కయెక్కడ? నాగలోక మెక్కడ యన్నట్లు యీగోచిబాపడట నాకూతురట పెండ్లిచేయుడనుట బాగుబాగు కొంచమైన తారతమ్యముంగానక యిట్టి వెంగలికూతంగూసె యిట్టి గుణగు సన్యాసిని యేమిచేయవచ్చునని మిక్కిలి కోపోద్దీపితమానసుండై వేరెలుగెత్తి పలికె నట్లు పలుకగా నారాజును జూచి నరేంద్రా, మీకిట్టి కోపంబును నిర్లక్ష్యంబును నాక్యంబుండగవు.

అటెంకు వేత్రిన్నాత్రుఁడై నవాడే; ఇట్టిమునీంద్రుని దివ్యప్రభావంబును చెప్పెదము వినుండు. ఇంద్రద్యుమ్న మహారాజును నదగజంబుగాబుట్టునట్లు శపియించె సముద్రములోని నీటినంతయు యరచేతిలో నిరెచ్చి గుటుక్కున ద్రావెను వింధ్యపర్వతముయొక్క గర్వమును జేపి సూర్యచంద్రులకు స్వేచ్ఛన సంచారము గలిగించె పాతాళ్నికి వుట్టుకు బుద్ధులన్నట్లు యింత గలిగినేని ముల్లోకంబులు గడగడవణంకును. అట్టిమహామునినింత చులకనంబుగా పలుకంబాడిగాదని పలికెను ఇట్లుండగా యీవర్తమానంబును రాజపుత్రికయగు లోపాముద్ర విని యపారంబగు భయంబున సంతోషంబునుం బొంది తత్క్షణంబున తండ్రివద్దకు వచ్చి ఆతనిం గాంచి సగారవంబున నతని తొడలపై గూర్చుండి యతనివలన నమ్ముని వృత్తాంతంబంతయు సవిస్తరంబుగా విని ఆ వెనుక తండ్రీ, మనపూర్వజన్మమున జేసిన వశంబున నమ్మహామునిం బ్రార్థింపకయే మనగృహంబునకు వచ్చె నితండు సామాన్యుడు గాడు పరమతపోధనుడు. యిట్టిమహానీయుండలిగెనేని మనకు బుట్టగతులు గలుగదు. తనకుతానే కన్యార్థియై మనసదనంబునకు వచ్చెగావున నతనికి

వన్నిచ్చి వివాహంబొనర్చుము నప్తసంతానంబులుధరించుటయేగాకమ
నకు ఐహికాముష్మికఫలప్రాప్తియుంగల్గు నీవు మొదటి యెట్టికార్యము
నైనం జేతునంటివి ఆడినమాటతప్పితివేని మహాఘోరనరకంబునంబడుట
యేగాక ఇతండలిగి శపించెనేని నీవంశంబునిర్మూలంబగు కావున నిట్టి
సత్పాత్రునకిచ్చి పెండ్లిచేయుటకుచింతింపవలదని చెప్పెను. చెప్పగాలక్ష్మా
నీవెన్నడు నిట్టి యజ్ఞానంబడవు ఇట్టివికారస్వరూపుండగు బకుగు బాపన
సన్న్యాసిని బాగాతలచితివే తల్లీ. యితడేనా నీకుమరియెవ్వడుం జిక్కడా
యమ్మా యితనిపైయాశపడకుము నీమనంబునకింపగుచక్కనివరునిం దె
చ్చెదచూడుము అని పలుకగా నాలోపాముద్ర తండ్రీ! పూర్వకాల యితి
హాసంబుకలదు తొల్లి మాంధాతృమహారాజునొద్దకు సౌభరియను మహా
మునీంద్రుండరుగుదెంచి యారాజపుత్రికలలో నొకదానినితనకిచ్చి వివా
హముగావింపుమనట్లు వేడ నంత నాభూపాలుండుమునిరూపమునరసి చింతాక్రాం
తుండై మునీంద్రా! నాకన్యారత్నంబులం జూపెదజూడుము వారిలో నెవ్వతెన
న్నువరించునేని యట్టిపుత్రికనిచ్చి వివాహంబొనర్చెద వరింపకేనినీదు
రదృష్టమని తలంపుమని నుడివె అంత నాజడదారియుం దానికి సమ్మతించి
యాక్షణంబున నంతఃపురంబునకుంజని యట్టికన్యకారత్నంబుల గను
లారంజూచినప్పుడాకన్యకామణులెల్ల నతని మన్మథుండనియనివరించుటచే
మాంధాత తనయభిప్రాయ మేమియుంగొనసాగకుండుటకుచింతించి యా
పుత్రికారత్నంబుల నేబదుగురను నామునికిచ్చి వివాహంబొనర్చెనని పెద్ద
లవలన వింటిని గావున నేనతనిందప్ప మఱియొక్కడెట్టిమన్మథుండైన
వాని నొల్లనని దృఢచిత్తంబునం బలుకగా తత్క్షణంబున యా రాజేం
ద్రుం డమ్మహామునికి యట్టికూతునిచ్చి పాణిగ్రహణం బొనర్చె.

ఆవెనుక నగస్త్యమహర్షి సుగుణంబులు కాటపట్టగు భాగ్యంబాంచి
మిగుల సంతోషంబునుంబొంది ఆకుమానసముల పర్యంతము నత్తవారిం
టనుండె. లోపాముద్రాదేవియు పెండ్లియైనదిమొదలుకొని తనమగని
భగవంతునిసమానముగా నెంచి పూజింపుచు వివిధశుశ్రూషలుం గావిం
చుచు శరీరపోషణంబునందైనను వస్త్రాభరణములు మొదలగు నలం
కారమునందైనను యపేక్షింపక యతని కనిష్టమాటలాడక సర్వకాల
సర్వావస్థలయందును భర్తృపదారవింద చింతాతత్పరురాలై యుండె.

యుచితపీఠంబులం గూర్చుండబెట్టిరి అంత నావిధులాంగి లోపాముద్రం జూచి యోపుణ్యవతీ "లేనివారమ్మ లేదనునా కొరకగాక కలిగినవారు అనుభవించు టకేమిచేయు" "ఓ నెలతా గుణసంపద గలిగియు నెలతా బాగుగ నుంగ గట్టనిచీర నిన్నానుబాం! గతిముత్తెచే కిగట్టిన నెలతా మ్మాయు కాను మొన్నివిధముల జూడక" అన్నట్లు శాబ్రేష్ఠునికు సుందరవై అవమానంబులగు భోగభాగ్యంబులు గలిగియుండియు వాటికొల్లక దివ్యవస్త్రాభరణ ధనకనకవస్తు వాహనాదుల మరలనారికిచ్చి యిట్లునారచీరలు గట్టి యలంకారహీనురాలై యుండెను నాబోటినారి తెవరైన వస్త్రాభరణంబులనిన్నియుడిగె కేసి నాకేమి చ్చెదవులనిపల్కె కల్యాగా నేనాయమ్మలయోత్యాతల్లీ నేనుసంసారహీనురాలై యున్నను మీవంటి పుణ్యాత్ముల కృపాకటాక్షంబున నమూల్యవివిధ వస్త్రాభరణంబులు గలిగి యుండుదాన మీకెద్దియిష్టంబగు వాటినిగోరుకొనిన యిచ్చెదననిపలికె నంతనావిధులాంగి పుణ్యవతీ! నీసొమ్ములనెల్ల నాకిమ్మనియడిగె నడిగినమాత్రంబున తల్లీ, యిదుగో యీ చెట్టుకొమ్మల నాకున్న సొమ్ములనెల్లం దవిలించియుండెదరామ్మపువ్వు కొమ్మని యొక్క చెట్టుంజూపనంత నావిధులాంగి సర్వాభరణాభరితయగు నావృక్షముం జూచి యబ్బురపడి యాపరమపతివ్రతాశిరోమణి ననేక విధంబులం బొగడి భర్తలం గూడి తన యాశ్రమంబునకుం జనె.

కావున సత్యభామా, నివికనైన నిశ్శేశ్వరుని ప్రాణేశ్వరునిగాదలచి పలువిధములగు శుశ్రూషలచే నతనిమనసు మెప్పించియుతనిమాటకెదురాడక మృదుమధురహిత సల్లాపంబుల తననికి ప్రియంబు గావించుచుండు వేనిపునరావృత్తిరహితంబగు శాశ్వతబ్రహ్మానందపదవి నీముంగొంగున ముడిచిన బంగారముపంటిదగు లోకులచేసత్కీర్తింబడసి యిహపరలోక సుఖంబులు నొక్కింతయు గొదవలేక యనుభవింపగలదానవు అనిపలికె.

గావున యింతులు లోకమున లోపాముద్రయుండినపతివ్రతయు శుచియు శీలమును భద్రమును సత్యశౌచములు గలిగి ఖ్యాతులు చెంది పతివ్రతలని మెప్పించి మోక్షార్థమగు కార్యములు చేయుచు పతిభక్తి గలిగి మగడే దైవమనినమ్మి జరుగవలయునని యీపుణ్యకథవలన వెలియుచున్నది సకలసార్థకము.

లోపాముద్రాదేవి ప్రభావము - ముగిసెను.



శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## ౧౩. సావిత్రీదేవి ప్రభావము.

అనేక యుగంబుల క్రిందట మద్రదేశమును పరిపాలించుచుండిన సాళ్వపతియను నొక్కరాజుకలడు అతనికి అశ్వపతియని మఱియొక పేరుంగలదు. అతనికిభార్య మాళవి, అట్టిసాళ్వరాజు అనేక దినంబులనుండి బిడ్డలులేక చింతాక్రాంతుండై 'అపుత్రస్యగతి ర్నాస్తి' అనుశ్రుతి వచనప్రకారము పుత్రులు లేనివారికి గతులు లేవుగదా! ఈశ్వరాయని దలంచి యొకనాడు మాళవి సహితుండై వనంబునకుం జని సురాసురుల కార్తేయంబగు దృఢమనస్కులై సావిత్రీదేవింగూర్చి తపంబుగావింపగా నాదేవి వారలనిశ్చలితోగ్రతపంబునకు మెచ్చి సంతసించి యోదంపతులారా! మీరిట్లు నిరాహారులై రాత్రింబగలనక యెండవానలకునోడక తపంబొనర్చుటకు గారణంబేమి యెరింగింపుడనిపల్క, నంతవారలా దేవింగని నమస్కరించి పలువిధంబులుంబొగడి తల్లీ! మేమనేకదినంబులనుండి యనపత్యులై యుండుటంబట్టి నిన్నుగూర్చి యట్టితపంబు గావించెదము. కులశ్రేష్ఠుండును సత్యసంధుండునునగు నొక్కకుమారుని మాకుం దయసేయుమని వేడిరి వేడగా నాదేవివారలంగని యోపుణ్యాత్ములారా! తొల్లియే మీకుపుత్రసంపత్తి లేకుండునట్లు బ్రహ్మదేవునిచే విధియింపంబడియుండ మీకెట్లు పుత్రవరంబిత్తు. కావున మీకుత్రిలోకసుందరియు శాంతశమదమాదిగుణప్రధానియు పతివ్రతాశిరోమణియు నగు నొక్క పుత్రికారత్నంబు గలుగునటుల వరంబిచ్చితి. అట్టి పుత్రిక పాతివ్రత్యప్రభావంబున మీకొక నూర్వురుకుమారులు బుట్టెదరని యానతిచ్చి యాసావిత్రీ యదృశ్యంబయ్యె. నంత కొన్నిదినంబులకు వెనుక మాళవీదేవి గర్భంబుదాల్చి సావిత్రీదేవిం గనియె.

అంతనప్పుత్త్రి సావిత్రీవరంబునం గలుగుటంజేసి యాశిశువునకు సావిత్రియని పేరిడిరి. సావిత్రి దేవి తలిదండ్రులకు ముద్దుచూపుచు సుకుమారియై జాబిల్లికళలంబోలె మనోహరంబుగ బెరుగుచు చిరుప్రాయంబుననుండి సుగుణంబు కాటపట్టగుచునుమెలంగుచుండ నబ్బాలికామణి యవ్వనంబుపొడచూప నంత నారాజపుత్త్రికామణి యౌవనారూఢయై యుండుటకు మిక్కిలిచింతించి యాశ్వరా అతిగారాబముతో నల్లారిముద్దుగాబెంచిన యీ నాబిడ్డకు తగినవరు నెవ్వడెత్తునని డోలాయమానసుండై యుండగా నట్టిసమయంబున మునిశ్రేష్ఠుండగు నారదుం డారాజుకడకరుదెంచి యతనిచే యర్ఘ్యపాద్యాది విధులంబూజలంది ఓ రాజా! యౌవనంబుమీరిన నీబాలామణిని తగినవరునకిచ్చి వివాహం బొనర్చిన సమయంబున సావిత్రియల్లనవచ్చి ప్రేమాతిశయంబులగు ముద్దులుచూపుచు తండ్రితోడనపై గారాబంబున గూర్చుండె అట్లు కూర్చుండియున్న కుమార్తెంజూచి యల్లనతడవి శిరంబుమూర్కొని నాయమ్మా! నాబిడ్డా! నీకిక వివాహకాలం బాసన్నంబయ్యె లోకంబునంగల రాజశ్రేష్ఠులలో నేరాజపుత్త్రునివరించుట నీకభిమతంబు జెప్పుము యాగుణంబునట్టివాడింద్రుం డైనం దెచ్చి నీకు పెండ్లిచేసెద జెప్పవే నాతల్లీ అనిఅడిగె అప్పుడారాజపుత్త్రి తనదాసీజనంబుచే సత్యవంతుండను రాజపుత్త్రునివృత్తాంతంబును సాకల్యంబుగావినియుండె.

గావున తండ్రింజూచి నాయనా! సాళువ దేశాధిపతియగు ద్యుమత్సేన మహారాజు దైవయోగంబున రాజ్య విభవాతిశయంబుల నోడియంధుండై దారాపుత్త్రసహితంబుగ పుణ్యారణ్యాతనంబున దినగూడును గట్టగుడ్డయులేక కందమూలఫలంబుం దినుచు మిక్కిలి గష్టపడుచుండె అట్టిరాజశ్రేష్ఠునకు వయోరూపవిద్యామనోహరుండును సుగుణాలంకృతుండును సత్యభాషణుండును చిత్రాశ్వుండను నొకకుమారశ్రేష్ఠుండు గలడు. అట్టి చిత్రాశ్వుండు తనయౌవనప్రాయంబుననుండి సూనృతావ్రతానుష్ఠానంబు గలవాడగుటవలన నతనిసత్యవంతుండను పేర లోకంబంతయు వాడుకగనుక తండ్రీ! నేనట్టియుత్తమవ్రతుండగునత్యవంతునే వరింతు మఱియెట్టిగుణాతిశయుండైన నవమన్మధుండైన నేనట్టివానివరింపననిపలికె. అంత నారాజు మునీంద్రుంజూచి స్వామీ! మీదివ్యదృష్టి

వలన త్రిలోకంబులంగల వృత్తాంతంబులెల్ల మీకు కరతలామలకంబులై వెలయుచుండుటయేగాక నిమిషమాత్రంబైన నలకం దీర్చుకొన బ్రొద్దులేక అహోరాత్రంబులు త్రిలోకసంచారంబు చేయుచుండు మహానీయుండగుటవలన మునీంద్రా! ఆసత్యవంతునివృత్తాంతంబును విస్తరంబుగా నాకానతిమ్మని వేడె. నంత కలహాశనుండా రాజుఁ జూచి నరేంద్రా! వినుము. సత్యవంతునకు పరిణయంబైన యొక్కసంవత్సరములోన మృతిబొందునది నిశ్చయంబుసుమా యనిపలికె. పలుకగా నతండాకూతుఁ జూచినాముద్దులకుమ్మా! నాబంగరుబొమ్మా! నానోముపంటా! అయ్యో! అతండల్పాయువు కడుదరిద్రుఁడు. వనంబులం గడునిడుమలం బడుచుండువాఁడు. కావున నాతల్లీ యట్టివాని గోరందగదు సకలగుణోపేతుండగు మఱియొక్కని గోరుమనిపల్కె.

పలుకగ నాయమ్మ తండ్రీ! మనోవాక్కాయకర్మంబులనునిమాట మనంబే ప్రధానమగుటవలన అట్టిమనసున తొల్లియే నేనతని వలచి యుంటి వాఁడెట్టివాఁడైనం గొనతలేనే కావున నేనట్టివానింగాక మఱియొక్కనిం బెండ్లియాడనని రాజశ్రేష్ఠుంగనిపల్కె. అంత నాభూపాలుండు రాచకులంబునంబుట్టు రాజస్త్రీలకు తొల్లియే నలుమోమునలువ స్వయంవరమను వ్యాజం బొక్కటి కల్పించె. అట్లు తమకు తామే పురుషుని వరింతురుగాక యను విధిలేకుండిన సర్వశుభలక్షణోపేతుండగు వరుఁ గూర్చి మహోత్సవంబుగ బెండ్లిసేయఁగ వచ్చుఁగదా యీశ్వరాయని చింతించి తత్క్షణంబున దృఢమనస్కుండై కొన్నిదినంబులకు వెనుక నారాజశేఖరుండు రథగజతురగపదాతులను చతురంగబలములతోడను ధనకనకవస్తువాహనంబులతోడను అమూల్యంబులగు నవమణిమయ భూషణాంబరములతోడను, దాసదాసీజనంబులతోడను, శోభనద్రవ్యంబులతోడను, మంగళవాద్యవిశేషంబులతోడను భూరికాహళభేరీభాంకారాది ధ్వనులతోడను మిన్నుపిక్కటిల్ల సకలబంధుపురోహితవిద్వజ్జనగాయక పాఠకవందిమాగధులతోడను, పత్నిదోడ్కొని సావిత్రీసహితుఁడై యొక్కనాడు శుభముహూర్తంబునందలి పుణ్యారంబునకుం జని సాళువదేశ భూపాలుండగు అశ్వపతింగని నమస్కరించి కుశలమోదంబులనడిగి నరేంద్రా! యీకన్యకారత్నంబు నాపుత్రిక. దీని నీ కుమారుండగు చిత్రా

త్యున కిచ్చి వివాహంబు సేయదలంచివచ్చితి. నరేంద్రా! నీయుద్దేశం బె ట్టిదాని కనతింతుమనిపల్క. పలుకగా సాళ్వరాజు జనపాలా! రాజ్యవి భవంబులం బాసి యిట్లడవులం గడునిడుములంబడుచు, ఉపవాసంబులచే శుష్కించు, వస్త్రహీనులమైయుండు మాబోటిదరిద్రులతో వియ్యము జేయుటకంటె భూమండలంబున మఱి వ్యర్థము మీకు లేదే! మఱియు నవమణి మయ విరాజితంబులగు సౌధంబుల నంతఃపురవాసులై యమృతోపమా నంబులగు బదార్థంబులం గుడిచి యుత్కృష్ట వస్త్రాభరణంబులం దాల్చి బంధు సఖిజనంబులతోడ సుఖంబుగనుండు రాచకన్నియ మాబోటికిం గూర్చిన సహించి మాతోడం గలసి మెలసియుండునే యీ దేటిమాట నీ వెఱుంగని ధర్మముం గలదే యని మద్రపతి కెఱింగించె. అంతట నమ్మద్రపతి సాళ్వపతిం జూచి భూపాలా, కలిమి లేములు కావడి కుండల వంటివి కావున యిప్పుడు మీపడు బాములు తిరంబులై యుండునని తలవకుము యిట్టి శోభనోద్యో గంబునకియ్యకొనుండని ప్రియవచనంబుల నాతని మోదింపంజేసి యొక నాడు శుభముహూర్తంబున సత్యవంతుండను చిత్రాశ్వునకుం దన కుమార్తె పుత్రియగు సావిత్రీదేవినిచ్చి వివాహంబొనర్చి కొన్నిదినంబులచ్చ టనుండి యంతట నా మద్రరాజు సన్నిహితుడై స్వదేశంబునకుం జనియెను.

అంత నా సావిత్రీదేవి వివాహంబైన దిమొదలు ప్రతిదినము పతికి మున్న లేచి జలంబులాడి శ్రీ ఘోడపుస్త్రి యింటంగల పనులెల్లం దీర్చి పతిచరణారవిందంబులకు మ్రొక్కి పతియే దైవంబని భావించి వివి ధోపచారంబుల నతని మనంబునకు ప్రియంబుపుట్టింపుచు రాత్రింబగలు భర్తృపదారవింద ధ్యానంబుననే ప్రొద్దుపుచ్చుచు లజ్యోదంగలుగు మునివరాంగనలారా యనం బతివ్రతాశిఖామణియై వెలసె నట్లలొక సంవత్సర కాలము వఱకట్టి సతీపతులు నిరుపాలుం గలసిన చందంబున గలసి మెలసి సరసల్లాపంబులనుండు నెడ అప్పరమపతివ్రతయగు సావిత్రీ దేవి వివాహంబైన మొదలు లోకసంవత్సరమునకంతయు దన ప్రాణేశ్వరుం డగు చిత్రాశ్వుండు నిలుగునని తొల్లి తనతండ్రికి నారదుండు చెప్పుచుండ దానును వినుచుండె

గావున నావాక్యము మదిం బెట్టి పెండ్లిదినము మొదలు వరుసగా నె న్నుచు నాదినంబునకు నాల్గవ దినంబున పతిమరణంబని తెలిసికొనియాదివ

శ్రోత్సవంబుగఁ జూపుచు, అల్లనల్లన నవ్వనంబంతయుఁ గలయం గ్రుమ్మరి
యంతప్రియంబగు ఫలంబులం బూవులం గోసి పుటికలం బెట్టి యింధన
మ్ములకొరకై యొక్క యెండినమ్రానిం గని చేగరిడియుచేగరిడియచే దా
నిం గొట్టి చీల్చుచుండె. అట్లు కొంతసేపు విదళనంబు సేయుచుండి బడలిన
చేతనుండు పరసునుం దటాలున క్రిందఁ బారవైచి యల్లనమ్రానిపైనుండి
దిగఁగడఁగడ వణకుచు అయ్యో ! ప్రాణేశ్వరీ నాయొడలెల్ల మిక్కిలి బరువై
తోఁచుచున్నవి కాళ్ళుం దడబడ సాగెఁ దలయు నొవ్వం దొడఁగె నడుము నిలు
వదయ్యె నేనేమి సేతు, యీవనంబున కేటికి వచ్చితి, నయ్యో నేనిన్నఁడు
నిట్టిబాధ పడి యెఱుఁగనె యీశ్వరాయని తటాలున భూమిపయిం బడఁబో
యె. నట్టియెడ సావిత్రీదేవి ప్రాణనాథుం బట్టి కూర్చుండి యతని శిరం
బును తనతొడలపైనిడుకొని ప్రాణేశ్వరా, భయపడకుము కొంతప్రొద్దు
నిద్రించితివేని బడలికదీరి సుఖంబుగ నుండును. అని ప్రియవచనంబుల
నతని నిద్రపుచ్చె, అట్లతండు నొడలెఱుంగక నిద్రబోవుచుండ సావిత్రీ
దేవి దేవునిచేతయు, సూర్యుం డస్తమించుటయు, ప్రాణేశ్వరు మరణం
బునుం దలచి తలచి హాదైవమా, నన్నిట్లు చేసితివా, ప్రాణనాథా, నన్ను
విడచిపోయితి అని వెరలుఁగున నేడువఁదొడఁగె

అట్టియెడ దండధరుండగు యముండు కాలపాశంబులం గొని గర్భ
నిర్భేదంబులగు యరుపులతో పండ్లు పటపటంగొరుకుచు శూలంబులం
జేబూని త్రిప్పుచు నచ్చటికి వచ్చి నిలచె. అట్లు నిలచియున్న ధర్మరాజుం
గని భయము జెందియు ధైర్యంబు విడక దేవా, నీవెవ్వండవు భూతమో,
ప్రేతమో, పిశాచమో, లేక నెట్టివాఁడవో యెఱింగింపుమని పలికె.
పలుకు నంతనతండా పతివ్రతం గని తల్లీ, కాలయముండ, సూర్యుని పుత్రుఁడ,
జీవులకెల్లం బ్రాణాంతంబు నొదించుచు దక్షిణదిక్కునేలువాఁడ నగుట
వలన నితని కాలపాశంబులం గట్టి నాపురంబునకుం గొనిపోవ వచ్చితినని
వానిలో జీవుని బట్టి కట్టుకొనిపోయె. అట్టిసమయంబున నాపతివ్రత య
తని వెన్నంటిచనుచుండె. నంత అతఁడామెగుఱించి జూచి తల్లీ, నీవేల యిటు
నాతోటి వచ్చెదవు. రాదగదిక నిలువుము నేబోవుమార్గంబికనీకు దృశ్యం
బు పొమ్ము పొమ్మని పలికె. పలుకగా దేవా, మీవంటి మహాత్ముల దర్శ
నంబు చేసిన సతులకు అదృశ్యంబగు మార్గంబు నొకటికలదేయని పల్కె.

అంతట యముండు పతివ్రతాశిరోమణి ప్రియవాక్యంబుల కేనం తోషించితి నీవు వేగిరము పతివినా యేదైన నొక్కవరంబడుగుము యిచ్చెదననియె. అంతనానారీమణి దేవా, మామామసాళ్వప్రభుండు కనుగానక వసింపబడియుండువాడు కావున అతనికిం జక్షులు దెలియునటుల వరంబు ననుగ్రహింపుమని వేడగా అట్లే వరంబిచ్చితినని పల్కి నిలువక పోవుచుండె. ఆవరంబందిముగలసావిత్రీదేవి వానితోడం గొంతదూరంబునచనగా తల్లీ, యేల మరలవచ్చెద వికనిలువుము అనిపలికె పల్కగా ప్రేతప్రభో మిమ్ముబోటియెఱుకంగల మహాత్ములు మనోవాక్కాయకర్మంబుల నెరింగి హింసచేయంబూనరు పరుల మనోభీష్టంబుల నెరవేర్తురు. అంతియుకాక దేవా ధర్మమార్గానువర్తిఅగుటవలన ధర్మదేవతఅనియు ప్రాణుల నియమించువాడగుటచేసి యముండనియు పేరొక్కంటివి కావుననీవెరుంగని కార్యంబొక్కటియుంగలదే అనిపలువిధంబుల ప్రార్థించుచుండె. అట్లుండు పనితారతమ్యముంగని అతండో పతివ్రతామణీ మిక్కిలి యాకటం డస్సినవానికి నన్నంబిడిన వాడెట్లుసంతోషించునో అట్లునీమృదుమధురామృతవాక్యంబులనుగలచె గావున నాయిందుముఖీ మరినెద్దిఅనిన నీపతివినాయొక్కవరంబు వేడుము యిచ్చెదననిఅనగా దండధరాతొల్లిమా మామపగతులచేనోటుపడిన రాజ్యవిభవంబును మరలబొందునట్లువేడె. వేడగా నటండిచ్చితిననియె. అంత నాయిందుముఖి అట్టివరంబులు రెండుంగని వెండియు వైవస్వతు దోడంజనె జనునెడం జూచి భామా, నీవేల మరల నావెన్నంటివచ్చెదవు మార్గమంబును మిక్కిలిభయంకరంబు నకు మార్గమును దాపరమ్యో. యికరావలదు నిలువుము అనిపల్కె. పలుకునంత శమనా ధర్మచరితులు తామునర్చు ధర్మక్రియలం దేజంబును మోహంబును విడువంగ గుడుగుగాక అని ధర్మంబువిడువనగునే వృత్తమస్త్రీలకు ప్రాణముకంటె దీపగు భర్తృపదారవిపూజంబె పునరావృత్తి రహితశాశ్వత పరబ్రహ్మానంద సుఖంబుననుభవింప నాధారము అట్టినా ప్రాణేశ్వరు నీవు కట్టుకొనిపోవ నయ్యో నామనంబెటులోర్చు నీవెరుంగని నీతియుంగలదే అనిపలికె

అట్టులను నారీమణింగని యోకములముఖీ, యాహా నీధర్మవా

వ్యాంబులకును పతి వచనంబులకును నా మనంబు బ్రహ్మానందం బయ్యె కావున గుణాభామణీ, నీపతివినా యొక్కవరం బెట్టిదైనం గోరుమని చెప్పెను. చెప్పగా యమునా సహోదరా, నాతండ్రియగు మద్రభూవరునకు నూర్గురుపుత్రులు బుట్టునటుల వరంబిమ్మనివేడె. వేడగా నట్టివరంబు నిచ్చితినని పోవుచుండె.

అంత సాశీల అట్టివరంబునుం బడసి వెండియు నాతని వెనువెంట బోవసాగె. అట్లువిడునక తనవెంటవచ్చుచుండు దానింగని వనితా అలవిగాని యిమ్మార్గంబున నీవ లెనింతదూర మేక్క రాగూ. నీపాతివ్రత్యప్రభావంబెట్టిదో యెరుగ మిక్కిలి బడలితివి. తల్లీ యికనైన నిలువుము. రాదగదు అని నుడివె. నుడువగా సావిత్రీదేవి అమ్మహాత్మునింగని యమపాలా, నా చిత్తంబు పతిచరణాంబుజంబులందు లీనమైయుండ, అట్టి భర్తవియోగంబు నెటుల సైతు. దేవా, యెవ్వరైన నేడుమాటలు నీతో నాడ నేర్చినట్టివారలు నీకుం జుట్టంబులు, ధరణీసురులు లేకువరంబులును, క్షత్రియులు నాలుగువరంబులును, వైశ్యులు రెండువరంబులును, శూద్రులొకవరంబు నడుగందగు కావున నంతకా నేనింకొకవరంబడుగందగుదాననని పల్కె. పల్కనెడ అవురా, నీపతిభక్తికి మెచ్చితి త్రిలోకంబులం గొనియాడదగు నీసద్గుణాలాపంబునకు సంతసించితి యోభామామణీ నీకిష్టంబగు మఱియొక వరంబడుగుము యిచ్చెదనని పలికె. పలుకగా నా ధర్మచారిణి శ్రార్ధ దేవా, యింతకుమున్ను నా ప్రాణనాథుని జీవంబుతప్ప వేఱొక్కవరం బడుగనుండుదును. ఇదివ్వరకు నా పతి బ్రతుకువినా అన్నివరంబుల నిచ్చితివి యిప్పుడట్టి 'మగనుదక్క' అను మాటమఱచి యెట్టివరంబైన నడుగుమంటివి ఇది నా భాగ్యము. సతులకు పురుషవిరహంబుకంటె దుస్సహంబగు కష్టంబొకటికలదే, పతినెడబాసి సవేనుక యీబ్రతుకేల కావున మహిషవాహనా భర్తవియోగచింతానలంబును నీకరుణామృతవృష్టింజల్లజేసి నా ప్రాణనాథుని లబ్జీవితునిం జేసి నాకొసంగవె దేవా అని మృదుకిరకిసలయంబుల సతిని పాదంబులం బట్టె, పట్టునెడ నతండు కాంతామణీ నీనాలాపంబులకు మనసుకరిగె యో పతివ్రతాశిరోమణీ వగవకుము. నీకు మోదంబలర నీమగని బ్రతికించితి.

ము దేచేకొమ్ము అని చింబినా ప్రేతపాశముసవిడచి యతని సజీవునిం
చేసి తల్లీ వినుము. నీప్రాణేశ్వరుండగు సత్యవంతుడు నాలుగు వేలసంవ
త్సరములు బ్రతుకు. ఇతనికి నూర్వురుకుమారులు బుట్టగలరు. మరియు
వీడనేకయాగములం జేసి సకలభోగభాగ్యంబుల ననుభవించి కడకు సాయుజ్య
పదవిం బొందు ననిచెప్పి తత్క్షణంబున నదృశ్యుండయ్యె. అంతలో సత్య
వంతుడు లేచి వనితా ఇంతసేపు నిద్రించితిగదే. నన్నేల మేలుకొల్పకపోతి
వనితా అయ్యయ్యో. నేనెన్నడు నింతసేపు నిద్రింపను. నిండుచీకటి క్రమ్మి
కండ్లుగానంబడవు ఇకనేమిచేతు. ఇంటనా తలిదండ్రులు నావలన యెట్టి
పాపమునకగుదురో యెవ్వరో యొకనిని పంపెదరు జాగు సేయకుము భామా
రారమ్ము పోదామనిపలికె, పలుకగా నాయకమణి యతని నిలిపి పాదసేవలు సేయుచుం
గని దేవా, మనసలము తీర్కొలికనవ్వ. ఇదిదుర్గమంబగుత్రోవ. భూతప్రేత
పిశాచమ్ములుం బిందులుగట్టియున్నవంబు నక్కలభయంకరంబగు నా
టమును సేయుచు తిరుగులాడుచుండు కావున నలవిరాత్రియందే నిలిచి
వెళ్లిపోదము. ప్రాణనాథా నామాటలవినుమని నేను. నేనుగా ప్రాణేశ్వరుం
గొంతెలలావూ నాతలదవసయుంచావె నాయెడ నటిపీడయుం దోలంగ,
మేనినత్తుసయుంబడసియుండువాడ. నికనే నెట్టునిలుపనోపుదుని వృక్షవచన
ములబలుకుచునట్టియెసంభాసి బయులుదేరి సంతసా సావిత్రీదేవియు పట్టి జే
శ్వరుగూడిముల్ల నల్ల నవతినింబట్టుకొనితాను కాటిసముకు ఆపతీంసచ్చి దేరె.

అట్లుండ నిక్కడ సత్యవంతుని తలిదండ్రులగు ముదుసలులిరువ
ఱూపుట్టిననాటనుండి యెన్నడు నిట్లువనప్రదేశమునకుం బోయియెఱుఁగని
నాబిడ్డలనేల యీదినంబున బొద్దుంటి కిదుమే తెరుంగని నాపసిబిడ్డలగు
సత్యవంతుడును సావిత్రియు నడుమపులో నెట్టికష్టములం బొందుచుండునో
త్రోవతప్పిరో, యెట్టియిడుములం బడెదరో, లేక యేమైరో యీశ్వరాయని
తలచికలచి పొక్కుచుండ నెడ సాళ్వపతి కండ్లుతెలిసి పత్నిసమేతుండై
వనమంతయు దిరిగి వారల వెదకుచు (హాసత్యవంతా హాసావిత్రీయని)
పేరెలుంగెల నేడ్చుచుండిరి. అంత సత్యవంతుడును, సావిత్రీదేవియువచ్చి
కన్నులకఱవుదీర ముదుసలులం జూచి వారిపాదారవిందములకెరగి వార
లంగూడి తమనిలయమునకుపోయి చేరిరి,

అంతనామగడు పూలబండ్లుంగోసిపుటికలం బెట్టి గరిడీయుంబూని

యింధనమున్నుకై యొక యెండ మ్రానిం జీల్చుటయు జీల్చి నెపబడలికడ గడవణకుచు చేయున్న నను పుంగ్రింద బొఆస్నంచి మ్రానునుండి దిగుటయు నతనివనతోడ దలగడంగావించి నిద్రవుచ్చునెడ యముండు వచ్చి కాలపాశముల జీవమును బట్టికట్టి యమపురమునకుంగొనిపోవునెడ దానును అతనితోడం జని ప్రార్థించి తానువడసిన నాలుగువరముల విధంబులను దెలిపె తెలుపగా వారలు ఔరా నాతల్లి యెంతటి మహత్కార్యము చేసితివి. నీమహిమం గొనియాడ వేనోళ్ళుగల యాదిశేషునకైన నలవియే యనిగొనియాడుచుండునెడ సత్యవంతుని తల్లిసావిత్రిం జేరదీసి తోడకై కూర్చుండ బెట్టి చుంచుదుష్వదుబుకంబు పుణికి ముద్దిడి మేనునిమిరి నాకులదీపమా, ఆపద్బాంధులారా, వాతల్లి యెంతపని చేసితివని మెచ్చి అట్లుండునెడ సాళ్వదేశమునునుండి మంత్రులును, బంధువులును, పురజనులలోనగు వారు చతురంగ బలములం గూడి పుణ్యారణ్యమునకు వచ్చి అశ్వపతింగని సవినయముతో చేదోయి మోడ్చి దేవా, పగతుడు సర్వజనవిరోధము నవంశజీ ఋండ్రై నశించి పడరాని బాములం బడి యమసదనంబునకరిగె. కావున నీకుం బట్టము గట్టవచ్చితిమని తెలిపి అశ్వపతినిం బుత్రుడగు సత్యవంతుని బట్టపుయేనుగపై నెక్కించి ప్రభుపత్నిసావిత్రుల నాందోళిపలం గూర్చుండ బెట్టి యవ్వనవాసులగు మునివరులను పత్నిసమేతులయి తోడరాటనలి పటహకాహళ భేరిభాంకారశంఖారవములును భూసభోంకారములు ఘోరుకొల్పువేణువీణామృదంగ మద్దళాది వాద్యములును మనోహరములుగా మ్రోయ మనోరమ్యములగు నృత్యగీతవాద్యములతోడను భూసుర స్వస్తివాచనములతోడను మునివరుల దీవెనలతోడను భూసురాంగనా శోభన గీతములతోడను సాళ్వదేశమునకుం జని రాజభవనము చొచ్చి అశ్వపతికి పట్టముగట్టి చిత్రాశ్వునికి యువరాజ్యపట్టముంగట్టి వారు వారు తమతమ నెలవులకుంజనిరి. అంత వారలు సకలభోగభాగ్యముల ననుభవింపుచు తుదకు సతీపతులిద్దరు పరమపదవి జెందిరి. కావున సత్యస్త్రీలకు పతిపూజతే యిహపరసుఖంబుల కాధారము. నీవు నట్టి పతివ్రతం త్రికరణశుద్ధిగా బూజించితివేని నీకొట్టికొరతయుం గలుగదు అని చెప్పెను.

సావిత్రీదేవి ప్రభావము - ముగిసెను.



శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## 14 చంద్రవదనాదేవి ప్రభావము.

పూర్వకాలమున కాశ్మీరదేశమునేలుచుండిన చంద్రశేఖరుఁడను రాజొక్కఁడుగలఁడు, అతనికిసుగుణంబుల కాటపట్టగుచంద్రవదనయనునొక్కకూఁతురుగలదు ఆపుత్రిక మిక్కిలిగారాబమునంబెరిగి చిరుతప్రాయమునందుండియే తనపూర్వజన్మపుణ్య వశంబునలభించినజ్ఞానముచేత ప్రపంచమేకల్లయనియు ధనకలకవస్తువాహనాదిసంపదలెల్ల మెరుపుతీగెలవంటివనియు కాయంబపాయుఃరంబనియుపుత్రమిత్రబాంధవులు మొదలగువారందరు యనుభటులనియు యిట్టిమాయారూపకంబగుప్రపంచసుఖంబుపైనుంచు ఆశయేతనకు కాలపాశమనియు తలంచుచుసచ్చిదానందస్వరూపమునకాధారమగు పరమహంసను నిర్మలమనంబను కాసారమున నోలలాడించుచు శాంతిదమదమాదిసద్గుణ భూషాంబర శోభితయైశుక్లపక్షమునఁగానసానుజాబిల్లి క్రోలెనానాట యౌవనమంకురింపఁదోడినెచ్చెలులంగూడి అట్టివారికి తత్త్వమార్గమునదేశించుచు సత్కథలంబ్రొద్దుపుచ్చుచుబంగారుమేడం దగుపసనుగొనుయాంతఃపురమున వెలుంగుచుండె

స్త్రీలుగలరే యని చిన్నబోయిన వదనంబులతో నెలపులంబారిన నెమ్మొగంబులతో మనమీ రాజకుమారుని మనయూరికిం గొనిపోదుమేని యిమ్మనుష్యుని నెమ్మొగము కళాహీనమై చిన్నబోయి డెందంబునం జాలి పతివిరహమునగుందుం గాక యని యోర్వలేనితనంబున అందరు నిద్రపోవు సమయమునకుం గొంపోయి వారివారి నిరయ కాలములయందతని నోతని విడిచిపోవుచుండిరి. అట్లుండుటవింటాఖ్యుడెరింగి అయ్యో ఇదియేమి మాయా, ఈ దేవస్త్రీలు నన్ను మోసపుచ్చి మాయోపాయమున తమని లయములకుం దెచ్చుకొని నేపతివ్రతాశిరోమణియగు చంద్రవదనయేమగునో విచారము నెంతగుందుచుండునో యనుకొనుచుండె.

పిమ్మట చంద్రవదనయు చిత్రాంగదయు నర్ధరాత్రమున లేచి యాకుశయ్యపైనుండి తనభర్తను గానకచింతించి చిత్రాంగద చంద్రవదనం జూచి చెల్లెలా, అయ్యో, ప్రాణనాథుడిప్పుడు మనపాంతనుండియింతలో నేమయ్యెనోయని మిక్కిలి విచారమునొంది నిద్రాహారములేక పతివిరహడోలాయమానమానసులయి నెవ్వగం గుందుచు మూడుదినములయ్యెడనివసించియుండి అంతటనా ట్రపాని చంద్రవదనంజూచి ముద్దుగుమ్మా మనమిట్లువిగాని పతివిరహమును సహించనేల నాపుట్టినిల్లయిదుగో సమీపమున నేయున్నది. బాగుసేయుక మనయుచ్చటికింబోయి నాతండ్రికి వర్తమానంబు జెప్పితిమేని యతడు పదిదిక్కులకుంజారులబంపి మనప్రాణనాథుని వెదకి తెప్పించును గనుక రావమ్మా పోదమనియె.

అనగానే చంద్రవదన అక్కా, మనప్రాణనాథుం డిట లేనికతి మనమెట్టికారమున నయినస్వేచ్ఛ జేయరాదు, మనయెడల పతివ్రతాధర్మము చెడకుండునే ప్రాణేశ్వరుం గేలరాడు త్రొల్లి వరుణదేవుని కూతురు త్రిలోకమోహినియనుదాని మగని సవతిం గొనిపోగా నట్టివాని తన పాతివ్రత్యప్రభావమున నామె తెచ్చుకొనలేదా నాబుద్ధి నూహింపగా మన ప్రాణనాయకుడు స్వర్గలోకమునయున్నట్లు తెలియవచ్చుచున్నది. నీకిష్టమయినయెడ నిప్పుడింటికిబొమ్మని పలికె పలుకగా నాచిత్రాంగద యాఘనాత్యపతింజూచి యక్కా, నిను నేవిడచి నొంటరిగాపోను కాళ్లువచ్చునే యని పలికె తక్షణమున కాశ్మీరపాంచాలాంధ్రదేశమునకు జని జరిగిన వర్తమానమంతయు చారునిచే చెప్పిపంపె.

సూర్యుండు పెక్కుఁడులంగా నంబడియు నొక్కఁడయిన తెఱంగు ననంతుండు సర్వగతుండయ్యును ఛిన్నుండుగాఁడు. శిల్పాదులయిన పెద్దలు తమలోన పరమాత్మస్వరూపంబున నున్న యీశ్వరుని యుపాధింబున నెఱుంగుదురు జీవాత్మకుపరుండయిన సర్వజ్ఞుయుండు తనమాయచే విశ్వంబు సృజియిం పఁగోరి రజంబున గ్రహింపంగోరి సత్వంబున నిద్రింపఁగోరి తమంబును త్పాదిం చిచరమయినకాలంబున సృజియింపుచు నట్టికాలమున నీశ్వరుండు సర్వసర్వ నుండయిదాలాహ్వయుండయి సాత్వికస్వభావులగు సాధుజనబృందములకు సాయుజ్యపదవియు రజస్తమోగుణంబుల నావేశించు దుష్టజనులకు హింసయుం జేయుచుండు దూషణభూషణతిరస్కారంబులు శరీరంబునకుగాని పరమాత్మకు లేవు. శరీరాభిమానంబునం జేసి దండకావాక్పారుష్యంబులు హింసమొనర్చు తెఱంగున నేనునాయదియనియెడు స్నైషమ్యంబు భూతంబులకు శరీరంబునం దేసంభవించు నభిమానంబు బంధంబు నిరభిమానండయి వధించినవధంబుగాదు. కర్తృత్వమ్మున్నవారికి హింసయు సిద్ధింపమన సర్వభూతాత్మకుండగు నీశ్వరునివయిషమ్యంబు లేదు. ఈశ్వరమూర్తియైన కాలంబునం జేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థానవృద్ధి నాశనశ్వపరిపాకనాశనంబులు ప్రాప్తంబులయిన తెఱంగున షడ్భావవికారంబులు దేహంబునకేగాని యాత్మకు లేవు. ఆత్మనిత్యుండు. జయరహితుండు శుద్ధుండు. క్షేత్రుండు. ప్రగనాదులకాశ్రయుండు క్రియాశూన్యుండు-స్వప్రకాశుండు. సృష్టిహేతువు. వ్యాపకుండు నిస్సంగుడు. పరిపూర్ణుండు నొక్కఁడుయని యాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబులగు అహంకారమమకారముల విడిచి పసిండిగనులుగల నెలవున విభ్రాజమానంబులగు గనకలేశంబుల పాషాణచయంబుల ఘట్టంబుపెట్టి తప్తిహ్నయోగంబు సంగరనూది హేమకారకుండు పాటవంబున బంగారముం బడియుచందంబున నాస్మృతకార్యకారణంబుల నెఱింగినేర్పర దేహంబునం దాత్మసిద్ధికొఱకు నైనం యుపాయంబునం జేసి బ్రహ్మప్రభానంబునవడయు మూలప్రకృతియు మహదహంకారంబును పంచతన్మాత్రలయు నివియెనిమిదియును ప్రకృతిగుణంబులనియు, కర్మేంద్రియంబులయిన వాక్పాణిపాదపాయూపస్థలును జ్ఞానేంద్రియంబులయిన శ్రవణత్వఙ్నయనరసనాఘ్రాణంబులును మనంబును మహీసలిలతేజోవాయుగగ

నములును నిషిద్ధాద్యును వికారంబు నియు సాక్షిత్వంబు వీని నిరువయి యేకింటిని నాత్మకూటమియుండు పెక్కింటి కూటువ దేహము అదియును జంగమస్థావరంబులును రెండురూపంబులు మూలప్రకృతి మొదలయిన వర్గంబులజాతేరయినిగణములంగూడియున్న సంగళసూత్రమునందం బున అన్నియిన్నిటియందుంజొచ్చి జీవించు ఆత్మ జన్మస్థితిలయములుగల వనిమిథ్యాతత్వపురుషులుగాక ఓ లేకశుద్ధమైనమనమువచారించి దేహం మునందాత్మ వెదకవలయు. యాత్మకు సవనలు కలిగినట్టుండుగానియునవన లేమాత్రము లేవు. జాగరణ, స్వప్న, సుషుప్తులును వృత్తిబేధాలచేత నెరుంగంబడునో అతడుఆత్మయనిచెప్పుదురు. కుసుమధర్మములైనగ్రం ధములచేతగంధాశ్రయుండయిన వాయువునెటింగెను భంగి త్రిగుణాత్మక ములయిక్కర్మజన్మములయిన బుద్ధిభేదములు నాత్మ మెఱుంగందగు. ఈసం సారముబుద్ధిసాధ్యముగుణకర్మగుణబద్ధము అజ్ఞానమునకుయంత్రణముసంసా రమునకుకలసంటిదిగాని నిక్కముగాదు సత్వార్థణములు మనస్సువలన బుట్టునని స్వప్నజాగరములుసమములు గుణశూన్యుండగుపరమాత్మకు గుణసంయోగమువలన జననమరణములుపాటిల్లినట్లుంటు పట్టిచూచిన నేమాత్రము లేదు. త్రిగుణాత్మకములయిన కర్మములకుజనకనుయివచ్చు చుండును. అజ్ఞానముఅనుమాటవి జ్ఞానమును వహ్నిచేగాల్చి కర్మవిరహి తులయి పరమాత్మంగనుట మేలు,

రాగాది యుక్తమనస్కుండయి శరీరికి సంసారనివర్తకంబయిన పరమాత్మధ్యానముబ్రహ్మాంబంకలినిర్వాణసుఖ మహానియులందగుభగవ ద్ధ్యానంబుమగ్నహముగాను పరమాత్ముడు సకలహృదయములందును అంతర్యామియై ఆకాశమువగిదినుండు విషయార్జనమువలన నెయ్యెడ యొక్కటియు లేదు .నిమిషభంగురప్రాణులైనమర్త్యులకుమహాపాత ములగుచు బలములయిన పుత్రమిత్రకళత్రపశుభృత్య బలబంధురాజ్య కోశమణిమందిరనుంత్రమాతంగతురగప్రముఖ విభవంములునునిరర్థక ములుయాగప్రముఖపుణ్యలబ్ధములయిన స్వర్గాదిలోకభోగములుక్షీణం బులుఅనినిత్యములుకావు నతండువిద్వాంసుండునని యభిమానించికర్మం బులుగోరక చేయునలయు గోరిచేసిదుఃఖఫలములు సంప్రాప్తములగు చుండును దేహముకొఱకుభోగమునపేక్షించు దేహమునిత్యముగాదు

తోడరాదు. మృతుడయిన దేహమును శునకాదులుభక్షించు దేహార్థములాచరించి కర్మబద్ధుండయి మరలగర్భానుకూలములైన దేహము దాల్చు అజ్ఞానముజేసి పురుషుండు కర్మదేహములని స్మరించుధర్మార్థకామములు జ్ఞానతంత్రములు జ్ఞానలభ్యము మోక్షము మోక్షప్రదాతయగు సకలభూతములగు నాత్మస్వరూపుండు ప్రియుండు తనచేతవయిన మహాభూతములతోడ జీవపుష్టతుండయియుండుసిద్ధములయిహృదయగతుండై నపరబ్రహ్మమునుసిజభక్తింభజింపనబడు. యుపతులకుపురుషుండునట్టి పరమాత్మస్వరూపుండు స్త్రీణాంభర్తృపినాకయినం నాస్తినాస్తి నసింశయః అను సద్వచనముచొప్పున పతినేదైవముగభావించినస్త్రీహృదయము సర్వలాభసమృద్ధిగానుమును సాధుజనసంగమమును నిశ్చలప్రతమానసమారాధనమును భర్తృశ్రీత్వమును పతియందలి ప్రేమయు భర్తృగుణకర్మకథానామసంకీర్తనమును, పతిపాదకమలధ్యానమును పతిసేలోకనపూజనములును మొదలునునవి మోక్షహేతువులు. జ్ఞానవయిరాగ్యలాభసాధనములయిన సాధుజనములయిరతిగలిగిన. నచ్ఛభర్తృపదారవిందధ్యానము మోక్షసాధనంపనియెంచి భక్తిచేయుచుండుదువేనిప్పనరాసత్తిరహిత శాశ్వతపుణ్యలోకంగకు కయివల్యమునిద్ధించునని జెప్పి యతిందంతర్హితుండయ్యె,

అంతటనాసుమతీదేవి బ్రహ్మానందపరవశురాలయి యింటికివచ్చి పదాభక్తపదారవిందధ్యానముసేయుచుండగా కౌశికుండునుదినంబున లంజగృహమునసుండి యింటికివచ్చి దురాచారుండయి పుంహార్థహరుండంతయుంగాక కొన్నిదినములుండి కడకుతినుటకన్నముకట్టనవస్త్రమును లేక మిక్కిలివిచారముహొంది యొక్కనాడుభార్యంజూచి యోసి! దుష్టురాలా, ఎల్లకాలము అతిథియభ్యాగతులకుపెట్టి కొంపకొల్లబెట్టితివిపకుం నన్నుగలిచేసితివి. యికనేనయూరకయుండను గాన నీ సీమబోయిబిచ్చమెత్తిజీవించెదను. నీవెక్కడికిబోక భద్రముగానేయుండుమని చెప్పె. చెప్పగా నామె ప్రాణేశ్వరా! మీరునన్నుబాసిచనిన నేయుంటనెట్లుంటను మనసుబుట్టదు కటకటా! ప్రాణనాథా! దిన్నపనుబాపముల పొందుబుచ్చి నేమప్రేమ సుఖముగనింటనుండి యి నొకజన్మమే కష్టసుఖములుభవమాధీనములు, పస్లొత్తట్టయుండగపలదే దవా! మీరలిట్టుపోవను. యొట్టి

అట్లుండగా సుమతి పతివ్రతాప్రభావమున భగవంతుం డాయడవిలోని రెంచువారల ప్రేరేపింపగా వారు ఆచోటికివచ్చి యాకొను త్రమానం కొట్టింగి తుంటనావిప్రుని యరణ్యమున వెదకినట్టి యతని బెదరించి వానిచే నామెకట్లు విప్పించి యికనయిన నీభార్యను యింటికి వెంటబెట్టుకొనిపోయి సుఖముననుండుము, లేనియెడల నిన్ను చంపుదుమని తర్జనగర్జనములనత్త్య పదలించి స్వేచ్ఛలబోయిరి. అంతనా భూసురుండు దొంగలచేతను చెంచువాండ్రచేతను నవమానితుడయిన మటివారలను దలంచుచు చింతాక్రాంతుడయి చెనుతలంపున భార్యను విడిచిపోనెంచె, అట్లుతలచియు తనయత్నంబేమియు కొనసాగకపోయినందున మిక్కిలి విచారమునొంది యెంతవిచారము బొందెనో అంత తెలివిపుట్టి ఛీఛీ! గురుజన్మమెందుకని తనలోదాను దోసి గతి తేనివానికి పెండ్లామేలంజ యనుసామెతననుసరించి మజల భార్యవద్దికిపోయి యిది సాధారణమైనది కాదు. పతివ్రతాశిరోమణివై యుండవచ్చునని తలచి ప్రియురాలా! రాకపోకమని మిక్కిలి నేస్తముతో దేబట్టి మెంపుసయ్యాటలలో నామెందోడ్కొని యొక బ్రాహ్మణఅగ్రహారమునకుబోయి నచ్చట కొన్నిదినములుండి పిమ్మట ప్రియురాలా, ఇచ్చటనుండి మరి నెంపయిన సోదమని యుంటివేని భోజనమునకు యేమిగతి యని యడిగె అనుగగా దేవా! బుద్ధికి నగపంబని లేదు. మీకెట్టి కొఱత లేకయుండ నగాను. ధయిర్యమున గనుండుడని తృప్తిబఱచి నొక బ్రాహ్మణు సంఘమునికి తేసుకొని అగ్రహారము కంగర బ్రాహ్మణగృహముల వచన మొదలగు పనులం జేయుచు మిక్కిలి విశ్వాసభూతయయి తా నుభర్తయు సుఖముగ కాలము గడుపుచుండిరి,

అట్లుండగా నొక్కనాటి రాత్రి యావిప్రుండు, క॥ కనకపుసింహాసనమున । శునకముగూర్చుండబెట్టి శుభలగ్నమునం । దొనరగబట్టముగట్టిన । వెనుకటిగుణమేల మాను వినరా సుమతీ॥ అన్నట్టుగా తనకొంటిగుణము మానకనాయగ్రహారముననుండి ఏకుదోసెడు వరహాలను పోయి ప్రియురాలా రెండుమూడు దినములలో నేకుదోసెడు వరహాలిత్తునని గోజారిగడ్డముంబట్టియేమో నీపుణ్యమని ఆరాత్రిదానితో కూడి తెల్లవారుటకు ముందు యొసరెకు గతొండమునుంగిడి తిన్నగా నింటికివచ్చెను. వచ్చినదినము మొదలు చలిజ్వరము, చేతులుకాళ్లు పట్టుకొనుట మొదలగు వ్యాధు

శ్వర్యములును గలుగునటుల దీవించి యంతర్ధానమైరి.

తరువాతనాయగ్రహారీకులు మొదలగులోకులందరునీమెపతిభక్తికి మెచ్చియనేకవిధములనామెంబొగడిరి. అది మొదలాసుమతి ప్రాణనాథుడగు కౌశికునిగూడి ధనకనకవస్తువాహనములు మొదలగు సంపదలంగొఱవడక ననుభవించుచు ననేకదినములకువెనుక భర్తతోడ మోక్షసామ్రాజ్యపదవింబొందె గావున సత్యా ఒకపతివ్రతకంటె మఱియొక్క పతివ్రతామహాత్మ్యమెట్లున్నది. చూచితే కావున నీకనైన నిన్నుగనిగౌరవించి త్రికరణశుద్ధిగాబూజించి యతనిమాటకడ్డమాడక సంతోషముం బొందునటుల మెలగియుండువేని నీకెట్టికొదువయుం గలుగదని చెప్పె. అనగా యింతులుతమపతులనుదైవముగాదలచి వారికెప్పుడు సకల ప్రీతములే జేయుచు హితములబల్కుచు గౌరవములు జూపుచుయుండుటే పతివ్రతలకు నూటియని యెఱుంగవలయును,

సుమతీదేవి ప్రభావము - ముగిసెను.



శ్రీ ర స్తు.

మహాపతివ్రతామాహాత్మ్యమును

# శ్రీ భ క్త వి జ య ము.

## 15 సు ర భీ దే వి ప్ర భా వ ము.

అనేకదినములక్రిందట కనకపురియనుపేరుగలయొక్కపట్టణముండెను. అందొకబ్రాహ్మణుండుండె. అతనికి సద్గుణాలంకారిణియు వివిధవిద్యావిశారదయునగు సురభియనునొకపుత్రికయుండె. ఆబాలికయొక్కనాడు తండ్రింజూచి నాయనా! లోకమున స్త్రీలు యేవిధమున పుణ్యలోకముం బడయుదురు. నాకెఱింగింపవేయనియడుగగా నతండాపుత్రింజూచి తల్లీ! లోకమునంగల వ్రతములన్నిటిలో భర్తృవ్రతమే దొడ్డవ్రతము. అటు

పంటివ్రతానుష్ఠానముననే సతులకు పుణ్యలోకములు కలుగును అనిపలికె. పలుకగా తండ్రీ! యేవిధమున పాతివ్రత్యము సంపాదింపనగు దానినియు మమెటువంటిది, సంసార తాపత్రయమునంబడి వేదనజెందు నీజీవునకు జననమరణములులేని మోక్షపదవి యేవిధమున సంప్రాప్తంబగు. దానిం జెప్పవే యని యామె యడిగెను.

అనుగగా నలెండాపుత్రింజూచి అమ్మా! నీమనంబును దేనియందు చలింపనీయక దృఢచిత్తురాలవై వినుము. యోగమునందు మృదుమధ్యమధికములని మూడువిధములు. ఈమృదుమధ్యసాధకము లొకటికంటె యొకటి విశేషముగానుండు. ఈశ్వరోపాసకులు విధిహితంబగు కర్మము లాచరించక భక్తితో నీశ్వరార్పణమని చేతురేని త్వరలోనటువంటివారికి యోగము సిద్ధించు. అవిద్యాదిక్లేశములు, పుణ్యపాపమిశ్రకర్మములు. సుఖదుఃఖభోగములు, చిత్తమునందు వాసనారూపములుగనుండు సంస్కారములు వీటిచేతనున్ను కాలత్రయములచేతనున్ను బాధపడనివాడెవడో అటువంటివాడే యీశ్వరుడనబడును. ఆయీశ్వరుడు సర్వజ్ఞుడనుటకు హేతువకలదు కావున యీశ్వరుడొక్కడున్నాడని జెప్పుటకు ముఖ్యప్రమాణమున్నది. ఆయీశ్వరుడు త్రికాలములచే బాధింపబడనివాడగుట వలన బ్రహ్మాదులగు వారికిగూడ గురువై యున్నాడు. అటువంటియీశ్వరునకు ఓంకారమే ప్రణవము, నామధేయము మూడున్నరమాత్రముగల ఓంకారము నుజపము సేయుటయును, దానియర్థమును భావించుటయును ప్రణవమనబడును. మూడున్నరమాత్రయనగా, అ.ఉ.మ.అర్ధమాత్రయు గూడిన ఓంకారమును పదేపదే చింతించుట జపమనబడును, దాని యర్థము భావించుట యనగా ఓంకారార్థప్రతిపాద్యుడైన యీశ్వరుని ధ్యానించుట యనబడును. కర్మములు, విహితము, వేదాభ్యాసము, పురాణ యితిహాసముల పఠనము సాధుజనపూజనము మొదలగునవి, నిషిద్ధకర్మములనగా పరహింసాస్పదములగు కార్యములజేయుట మొదలయినవి. మూఢకర్మమనగా మిశ్రకర్మ పుణ్యపాపములతోడ సంబంధించినవి. ఈశ్వరుని జెప్పెడు ఓంకారజపమువలన చిన్మాత్రుడయిన పురుషునియొక్క విఘ్నములు తొలగును. జ్ఞానములభించును. తనకంటె నేరయిన యీశ్వరుని ధ్యానించుటవలన ఆత్మసాక్షాత్కార మెటులకలు

జతేశృష్ట్వా నాగీకృత్యానసత్యతి' అను గీర్వాణవచనాంశంబునను, అర వరాసి ఆలినికట్టుకొని మురిగిచచ్చె రాముండాకొడుకు అన్నటుల స్త్రీల హృదయమునందుంకు హాస్యముదెలయు హరిహరాదులకైన నలవిగాదు కావున నేనొకకన్యకను మూడు ప్రశ్నలడిగెదను దానికి తగిన ప్రత్యుత్తర మదియిచ్చునేని అవశ్యము దానిం బెండ్లియాడెదనని పలికె.

పలుకగా బ్రాహ్మణుడు తన పుత్రికి నతని మానము జెప్పి దానినా బ్రహ్మచారి యానురభీదేవిచక్కదనమును శోభనరేఖావిలసితమగు నెమ్మొగమునుజూచి యంతుష్టాంతరంగుండై స్త్రీలకు (సీచెద్ది? శ్రేష్టమేది? భూషణమెయ్యది?) యని యాకన్యనడిగె. అడుగగా నాసురభి స్త్రీలకు తుచ్ఛములును యౌవనమూర్పువంటిదియగు నుహాలోకముసం గలుగు భోగమే సీచము. జ్ఞానాంకమే శ్రేష్ఠంబు. పాతివ్రత్య ధర్మభూషణంబని పల్కె. అంతనతండు మెచ్చి దీనిజలన మనకునున్నతియుంగలుగునని యోచించి దానిని వివాహము చేసుకొని యత్తవారింటనే యనేకదినంబులుండగానురభిదేవి పెండ్లికాగానే పతినిపరబ్రహ్మ స్వరూపునిగా నెంచి త్రికరణశుద్ధిగా పూజించుచు అతనిమనస్సునునంతోషపెట్టుచు నటులనిక్షేపచారములనాదరించుచు పదాభర్తృసంతోషరవింకనుకొని సేవించుచుండెను.

అట్లుండగా సముద్రునకు కూతురైన నరసయనొక బ్రాహ్మణోత్తమ వాంచాపరురాలయి తనచెలికత్తెలగు మకరములను గొప్ప మత్స్యముల జూచి చెలియలారా! వేదాంతవిచారుండును సకలశాస్త్రప్రవీణుండును, బ్రహ్మచారియు నయమానమునునా, రూపవంతుండైన నగు నొక్కపురుషసింగనిశ్రేశంకు చంద్రగ్రహము చ్చుచున్నదియని యాజ్ఞాపించె. అవి అమ్మా! చిత్తంబులని సముద్రతీరంబులందంతట గనిపెట్టుకొనియుండె. అంత నొకనాడాయగ్నిదత్తుడు చంద్రగ్రహణంబునాడు స్నానంబుచేయుటకై భార్యతోడబంధువులంగూడి సముద్రతీరంబునకుజని భార్యయుదానుం గొంగుముళ్ళతోటి సముద్రంబునం గ్రుంకనిరి. మునుగగానే యొక మొసలివేగిరంబువచ్చి యాదంపతులకొంగుముళ్ళు తెగకొరికి యాబ్రాహ్మణు నీడ్చుకొనిపోయి నరసముందు బెట్టె. అమ్మా, ఇతడు వేదాంతవేత్తయును బ్రహ్మచారియగు సౌమ్యుండనియు మ్మర్పకగా నాసరస యాతని రూపరేఖావిలాసంబులకు మెచ్చి గాంధర్వవివాహంబున, వానినివరించి వినతనాతో

తమని పెక్కువిధంబుల నామెనుం బొగడి యా బిస్తవాసి బ్రతికించి యా
సముద్రంబును యెప్పటివలె జేసి జలజంతువులనుం బ్రతికింపుమని ప్రార్థించిరి.
ప్రార్థింపగా నాపతివ్రత సముద్రుని యెప్పటివలెనే జేసి నీటిజంతువులనుం
బ్రతికించె. అంత త్రిమూర్తులు ఆమె ప్రభావంబునకు యాశ్చర్యపడి దేవత
లతోటి తమతమ సెలవులకుం బోయిచేరిరి. కావున నేడును అటువానిగనీ
బ్రతికించి తెచ్చుకొనుటయుండె. లేక నేనైన ప్రాణంబులవిడుచుటయుం
డెయనిరలవాకుం దెల్పి యాక్షణంబున పద్మాసీనయై యాసనంబుజేసి
పతిపదారవిందంబులు చిత్తంబుననిడి త్రేతాగ్నులనొక్కటింజేసి వానితో
టితనపతివ్రతా యోగాగ్నింగూర్చి విస్తరిల్లజేసి యుష్టయగ్నులచే సము
ద్రజలమంతయుం బీల్చి జలచరంబులకు ప్రుపద్రవంబు కలిగించుచుండె.

అట్లుండగా యాదేశపురాజా యాసంగతివిని సముతీరంబునకు
వచ్చిసురభీదేవింజూచి యాశ్చర్యపడి ఆమెకు యొంతెగలకుండ పందిళ్ళు
వేయించి కొందఱుభటులను ఆమెకు కాపలియుంచి అప్పటికప్పటిసమా
చారంబునప్పుడప్పుడు రాపింపుకొనుచుండెను. ఇట్లుండగా ఆదేవిపతి
వ్రతాగ్ని పెనుమంటలతో పయికినెగసి పిడుపటుశబ్దంబులతో సముద్రంబు
పయిబడి సముద్రజలంబునంతయు శోషింపజేయుచుండె. అంతసముద్రుం
డాయగ్ని వేడనోర్వలేక తనబుడుచు వారులవలన జరిగిన వర్తమానంబం
తయునవిస్తరంబుగా యెరిగి తనపుత్రికయగు సరసయుండు బోధంబ నకుం
బోయి తల్లీ! నీవుచేసినకార్యంబువలన ప్రమాదంబుకలిగె లోకులందరు
చిందఱవందరులయి యగ్నితాపంబున పరితపించుచున్నారు. ఆశ అందల
మెక్కవలెననియున్నది అన్నటుల తల్లి నీవే సాటి. సురభీదేవి యేపాటి.
ఆమెపతివ్రతాశిరోమణియె. అట్టిదానినుగసినీవుచేపట్టితేగునా ఆమ్మా,
చేపట్టినా అతడునీకబ్బునా బంగరుబొమ్మా ఇంతవట్టుకుఅనుభవించినది
చాలును యింక నతనివిడిచిపెట్టుమమ్మాయని ప్రార్థింపగా యాసరస
సముద్రునింజూచి తండ్రీ! నాప్రాణసఖుడవు నేనెట్టునేగాని ఈనాభర్తను నే
నెంతమాత్రంబువిడువను అని పట్టినపట్టువదలకుండె. అట్టిపుత్రినిసామవ
చనంబున సమాధానపఱచి అతనినిడిచిపెట్టుమమ్మాయని వేడగా నాయ
నా నన్నుగూడతోడ్కొనిచని యాసురభీదేవిని స్వాధీనపఱపుము లేకుం
టే నేనెంతమాత్రమబ్బబ్బా విడువనన్నిలికె, పలుకగానేసముద్రుడంత

నట్టియగ్నిదత్తునితోడ సరసనుం దోడ్కొని సముద్రపుగట్టునకు వచ్చి సమాధి నిష్ఠనుండు సురభీదేవిం జూచి నమస్కరించి పలువిధంబులం బొగడి తల్లీ! యిదిగో నీభర్త. కనుదెరచి చూడుము. కోపాగ్నిచల్లార్చి నీకృపాకటాక్షంబుల మమ్ము రక్షింపవే తల్లీ! యని ప్రార్థింపఁగా యామె నిష్ఠం జాలించి కనులు దెరచిచూచె.

అంత నాసముద్రుండు తనకూతురగు సరసను యామెపాదంబులకు మ్రొక్కించి అమ్మా ఇదిగో భర్త ఇమ్మ యిది నాపుత్రిక దీని పేరుసరస దీనిని స్వాధీనపఱచితిని. దీనిని నీతోఁగూడఁబుట్టిన చెల్లెలుగా నెంచి మన్నింపుము అని యనేకదివ్యరత్నంబులతో నామెను పూజించి దివ్యవాద్యంబులతో మహోత్సవంబు సేయించి తననెలవునకుఁ బోయె.

అంతలో నీవర్తమానంబును చారులచే నాయూరి రాజువిని మంగళవాద్యంబులతోఁ దవచ్చి యాపతివ్రతకు నమస్కరించి అనేకవిధంబులఁ బొగడి అగ్నిదత్తుని పట్టపుటేనుఁగుపై నెక్కించి అందలంబున సురభీదేవిని సరసనుం గూర్చుండఁజేసి మహోత్సవంబుతోఁ దనపట్టణంబునకుఁ గొనిపోయితన చెంతఁబెట్టుకొని ధనకనక వస్తువాహనాది భోగభాగ్యంబుల వారల నేలించుచుండె.

అంత నాసురభీదేవియు సరసయుంను మిక్కిలి విశ్వాసంబుగలిగి తనతోఁబుట్టిన చెల్లెలికంటె నధికగారాబంబున ప్రేమించుచు ననేకదినంబులుభూలోకమందుండి అష్టయిశ్వర్యంబులనుభవించి తుదకు తనభర్తయుదాను మోక్షసామ్రాజ్యపదంబునకుంబోయి చేరిరి.

సరసయు తనతండ్రియగు సముద్రునిచెంతంబోయి చేరి పూర్వంబువలెనే మెలఁగుచుండె అనఁగా యింతులు తమపతులను దైవంబుగాఁ దలచి వారికెపుడొకనాఁ డప్రియంబులేజేయుచు హితంబులుబల్కుచు గౌరవంబులు చూపుచుయుండుట పతివ్రతలకు మూఁటయని యెఱుంగవలయును.

సురభీదేవి ప్రభావము — ముగిసెను.

—( )—

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.

## 17. ప్రభావతీదేవి ప్రభావము.

పూర్వము పాటలిపురమును ధర్మమార్గమున నేలుచుండిన చంద్రశేఖరుండను సూర్యవంశపురాజొక్కరుండుగలడు. అతనికి ప్రభావతియను నొకపుత్త్రికామణికలదు. ఆమె తన బాల్యప్రాయమునుండి సహజంబగు జ్ఞానసంపత్తికలదియు, వేదశాస్త్ర పురాణేతిహాసధర్మములను పతివ్రతాధర్మమును ఆదినుండ్యాంగములుగ నెఱింగి జగద్విఖ్యాతంబగు సుగుణముల కాటపట్టయి రూపురేఖా లావణ్య సౌందర్యాది విభవముల నతిశయించియుండె.

ఇట్లుండగా కొన్నిదినముల కీప్రభావతికి యౌవనము ప్రాప్తమయ్యె. అంత నాచంద్రశేఖరుండా కుమారిం జూచి నాతల్లీ యొకని కిత్తు వివాహము చేయదలచిన యూహాపరత్వము గనుక యెట్టి గుణాఢ్యుండగు వాని నీవువరింపనిష్టపడెదవో సెలవిమ్ము ప్రాయము బరికించి నేను అట్టివానినియిదె కొనితెచ్చి మహోత్సవముగా నీకు పెండ్లిజేసెదనని పలికె. పలుకగానే ప్రభావతి తండ్రీ, లోకములో సతికితగినపతియును, పతికితగినసతియును నమకూడుట మిక్కిలిదుర్లభము కావున నాకువివాహమే అక్కరలేదు. సదాకాలమును నేను పురాణేతిహాసశ్రవణ పరాయణత్వముతోను, పతివ్రత ప్రభావకథాశ్రవణానందముతోడను బ్రొద్దుపుచ్చుచు పునరావృత్తిరహితమగు మోక్షపదవికిం బోయెదనని దృఢముగబల్కె. అంత నారాజశేఖరుం డావచనములు తనప్రాణనాయకికిం దెల్పి అదిమొదలు అయ్యో, నాకుబిడ్డలులేకయుండి యున్నాళ్ళకు భగవంతుడనుగ్రహామున నిట్టి పుత్త్రికపుట్టె. పుట్టినానుండి మహోన్నతపదవి బొందినటుల నేనేమో బ్రహ్మానందపరవశుండనై వంశమునకుద్ధారకురాలైనదని కూతురైననిదే తుని మిగులగారాబముగాబెంచి నేటికాలానికి చక్కనివరునిం

గూర్చిముప్పొద్దుగాదీనికి పెండ్లిచేసిసంతోషముబొందుదమని యెంతో ఆశకలిగియుండగా నాకుపెండ్లియే యక్కఱలేదని వైరాగ్యమున్నదే. ఇకనేమిసేయవచ్చు నీశ్వరాయని అన్నమునీరు నంటక అహోరాత్రములు మిగుల మనోవ్యాకులమున గృశించుచుండె.

అట్లుండగా నొకనాడు మునిశ్రేష్ఠుండగు నారదుడుచంద్రశేఖరుండున్నయెడకువచ్చి యతనిచే సత్కారములువడసి యుచితాసనమున గూర్చుండి యోరాజా, కుశలమేమియనియడిగె అడుగగారాజు మునివరా, ముల్లోకములుగల వర్తమానములెల్లను మీకు మనోగోచరములయియుండ నేనేమనిచెప్పంగలవాడనని విశేష చింతాక్రాంతచిత్తుండై కరకమలములు ముకుళించి యూరకనిలిచియుండె. అట్లుండు భూపతింజూచి నరేంద్రా, నీపుత్రి నావివాహమునకనయునం భక్తివాంఛగలదానింజేసెద. ధైర్యమునవుండుమని పల్కి ప్రభావతియున్న సౌధమునకుంజని యామెచేయర్ఘ్యపాద్యాదివిధులంపూజలంది తగిన పీఠమునంగూర్చుండి ప్రభావతీ, చతురాశ్రమములలో గృహస్థాశ్రమమే శ్రేష్టము. అట్టియాశ్రమమునవుండి పతిని దైవస్వరూపముగ భావించి మనోవాక్కాయకర్మముల నొక్కరీతిగా పతిని వివిధోపచారముల పూజించుచు సదా పతిపదారవిందముల భక్తియే యిహపరలోకసుఖములం బొందుటకు మార్గమనితలచి అట్టిపురుషునిచే మహత్తత్వారములనెఱిగి పతిచరణారవిందస్మరణమునం బ్రొద్దుపుచ్చురేని అట్టివారికి మోక్షపదవి ముంగొంగు బంగారమువంటిది యగునే గాక మఱియొకవిధమున నెంతమాత్రము గడతేరలేరు. కావుననీవువివాహముచేసుకొని అట్టిపురుషునివలన సద్గతిం బోగలదానవు అని పలికి యంత నమస్కారవగుమును స్వేచ్ఛం జనె. అంత నారాజపుత్రి యున్నయెడకుం జని అమ్మా, మహనీయుఁడగు అరివేరంపు తపసిపలుకులువింటికదా. ఇకనయిన నట్టివైరాగ్యమునుమాని పెండ్లిచేసుకొనన సమ్మతించుము అని పలికె. పలుకగా ప్రభావతి యతనింజూచి తండ్రీ, వేదశాస్త్రపురాణేతిహాసధర్మములను, మహత్తత్త్వారములను నెఱింగి మిక్కిలివివేకపరుఁడై శాంతిశమదమాది గుణంబులతో సదా దేశాటనము సలుపుచుండువాడెవడో అట్టివానిందప్ప మఱియొకని నేపెండ్లియాడనని వాక్రుచ్చె.

అట్లుండగా మగధ దేశ రాజపుత్రుఁడగు చిత్రకరుం డనువాడు
సకల శ్రుతిస్మృతిపురాణేతిహాసధర్మముల నెఱుఁగుచు యౌవ్వనప్రాయమున
నుండి దేశదేశములు దిరిగి మార్గవశమున నాపాటలిపురమునకువచ్చి అచ్చటి
వారిచే ప్రభావతి వివాహప్రయత్నమంతయు విన్నవిని సంతోషించి యా
రాజమందిరమునకుం జని యతనిచే గౌరవింపబడి యంత తన వర్త
మానమునుం దనమనమునన్న యభిప్రాయమును నెఱింగించె. పిదప
నారాజు చిత్రకరుని సద్రూపలావణ్య విద్యాప్రభావమును నతని
శుభలక్షణములును గని సంతసించి యావర్తమానమును విశదముగ
ప్రభావతి కెఱింగించె.

ఇట్లుండ ప్రభావతి యంతయు నతనివర్తమానమువిని సమ్మతించె.
అంత నారాజు శుభముహూర్తమున ప్రభావతి నతని కిచ్చి సంతోష
ముగా పెండ్లిచేసి పెండ్లియైనదిమొదలు ప్రభావతియుపతిని బ్రహ్మ
స్వరూపముగాభావించి షోడశోపచారముల నతనింబూజింపుచు నతనిచే
సకలవరమార్గముల నెఱుంగుచు రాత్రింబగలును పతిపదారవిందధ్యా
నముసేయుచుండె, చిత్రకరుండును ప్రభావతిదేవియొక్క గుణాతిశయం
బులకు భక్తివిశ్వాసములకునుమెచ్చి కొన్నిదినములుఅత్తవారింటనుండి
పిమ్మట ప్రభావతిదేవియొక్క పతిభక్తియెట్టిదియో పరీక్షించవలెనని
యొక్కనాడు భార్యంజూచి ప్రాణకాంతా! ఇకను దేశమునకుపోదము
రమ్మనపల్కి అత్తమామలకు నమస్కరించి వారిచే సెలవుపుచ్చుకొని
ప్రభావతి నొకగుఱ్ఱముపై నెక్కి తానునొకయశ్వముపై నెక్కి మగధదే
శమునకుపోవుచు మార్గమునందగు నరణ్యములయందు వినోదముగా
మృగముల వేటాడుచు, కమలాకరములం జలక్రీడలాడుచు నట్టివనప్రదే
శముల వివిధసుఖములనుభవింపుచు అచ్చటిపుష్పఫలవృక్షంబులమెచ్చు
టయు, పక్షివిశేషముల శ్రవణానందమగు స్వరములను "గంటేవింటే"
యని ప్రియముగలిగించుచును. ఒకనాటిరాత్రియరణ్యమున నొకవృక్షము
క్రిందసుఖముగాపరుండి యొడలెఱుంగని నిదురం జెందిరి. అంతనాచిత్రా
కరుండర్ధరాత్రంబున లేచి ప్రభావతిగాఢముగనిదురపోవుట యెఱింగినవా
నిముషమునందు ప్రభావతీప్రభావతీయని మూడుపర్యాయములు పిలిచి
ఆమెపలుకకుండిన దానినొకనెపముగా నెంచి యిదేసమయమని తలచి

బాహానెక్కి వాయువేగమనోవేగంబున మగధదేశంబునకుంబోయిచేరె.

ఇక్కడ ప్రభావతి చిత్రకరుండు తన్నువిడిచిపోయినముహూర్త మాత్రంబున లేచి తనప్రక్కపరుండిన నాథుంగానక చింతించి అవ్వనమంతయు జక్కగా వెతకి యెంతకు అతడు కానకయుండుటకు మిగులవగచి హా ప్రాణనాథా, యెందరిగితివో, యేమైతివో యని పురుషధ్వని వాపోయి కొంతసేపటికి ధైర్యమవలంబించి అతడు మగధదేశంబునకయిపోయియుండ వచ్చునని యోచించి తత్పతివ్రత భర్తృచరణసరసీరుహంబులకు స్మరిం చుచు మగధదేశంబునకు పోవుచుండె. అట్లు పోవుచుండగా కొందరు దొంగలు హా. యెవతెవో జగన్మోహినీదేవతవలె నియరణ్యంబున సర్వాభరణభూషితురాలయి యొంటరిపాటున నిర్భయంబుగా పోవుచున్నది, ఇది వనదేవతయో, దేవతాస్త్రీయో, కిన్నరస్త్రీయో, అప్సరసయో లేక మనుష్యస్త్రీయోయని యామె చేరగ నరుదెంచి యోభామినీ, నీ వెవ్వతెవు? యీ యర్ధరాత్రంబున ననాథయి యెక్కడికి పోవుటకు కారణంబేదయని యడుగగా యామె వారలంజూచి భయపడి గడగడవణకుచు హా ప్రాణనాథా! యేమిసేతునని పతిపదాంబుజంబులదలచి ప్రణవధ్యానంబుజేసి తటాలున తనమంగళసూత్రంబును దారిపయివిసరివేసె, వేయునంత నది పతివ్రతాప్రభావాగ్ని యగుటవలన ప్రళయకాలాగ్నివలె వారిపయిబడి వారందఱు భస్మీకృతమొనర్చెను. ప్రభావతి చెంతకువచ్చి చేరె. అంతనామాంగళ్యమునుగట్టుకొని అశ్వారోహయయి యనేక వనంబులు చేసిచని యొక్కప్రదేశంబునం జను నొక్కమహాఋషి యాశ్రమంబునకుంబోయి యతనికి నమస్కరించి తాబడుబాములన్ని తార్కాణముగా నతనికివివరించినిలువగా నప్పుడా దేవింగని దివ్యదృష్టివలన చిత్రకరుని వర్తమానంబును నామె విషాదంబునకు గారణంబు నెరిగి తల్లీ! భయపడకుము. నీప్రాణనాథుండగు చిత్రకరుండు మగధదేశంబున సురక్షితంబుగ నున్నవాడు. నీవును బతివ్రతాశిరోమణివి. నీమనోభీష్టంబెరుంగగలవు. నీప్రాణేశ్వరుం డిట్లు నిన్నలయించెనని ధైర్యంబున నుండుము. పతిభక్తి నేమరకుము. మానభూషిణీ! అని జీవన్ముక్తికి నుపాయంబుజెప్పి మునికన్యలచే నామెకు వివిధోపచారంబులం జేయించుచు తన యాశ్రమంబునం బెట్టుకొనియుండె,

అట్లాంగానీ త్రికరుండును తనపురము చేరి తనతల్లిదండ్రులకు తా నుచాంద్రాయణము భూమి చుట్టివచ్చుడ జరిగినవిధము మొదలగుజరి గినసంగతులనెల్ల విశదముగా జుల్పె. తెలుపగా వారతనింజూచి కీదు గ్గడా ఆహా, ఇట్టిమానవతియు గుణభూషణియు పరమపతివ్రతయునగు ప్రభావతిని యిట్లు యవమానపాలుచేసి యొంటరిగావిడచి రాదగునా, ఇట్టి ఘోరకృత్యంబునెవరయినను నిదివరకు చేసిరా, ఇట్టిలోకనిందనుమనమె ట్లుభోవుకొనవచ్చు యని మిక్కిలి వ్యసనాక్రాంతచిత్తురాలైయుండిరి. చిత్రకరుండును దానుంజేసిన యన్యాయకృత్యమునకయితలపోసికలపోసి బుద్ధిభ్రమచే పిచ్చివాడయి తిరుగుచుండెను.

అంత నక్కడ ప్రభావతి ఆమునీంద్రునిచెంత కొన్నిదినంబులుండి మహా తత్వజ్ఞాన పరిపాకంబునుంబొంది యంతట నొక్కనాడు తనదివ్య వస్త్రాభరణాదులనెల్లనమ్మునిపాదపద్మంబునకు సమర్పణజేసిమునీంద్రా! లోకంబున నెట్టివారికయిన ధనకనకవస్తువాహనంబు లేవి భయంకలిగించుట కాధారమయియున్నది. యట్టిధనాపేక్షను విడిచినవారికట్టి భయముగలు గదు. కావున యికనేభయంబులేక మగధదేశంబునకుం బోయివచ్చెద, నాయందనుగ్రహంబుంచి సెలవిండనిపలికె. పలుకగానె యోసద్గుణా లంకారిణి, సర్వసంగపరిత్యాగులమైయుండెడువారలకీద్వొక యిట్టియువతుం లోచెట్లపుట్లచెంతవసించి జీవనమ్ముకయితపంబుగాపించు మాబోటిము నులకు యిట్టివస్త్రాభరణంబులతోటనేమి? ఇవిమాచెంతనుంచుకొన్న యెడల మానిలువనములకును హానిగలుగు కావున యోచంద్రముఖీ! భ యపడకుము యని యామెకు రక్షకరకయి స్వహస్తాగ్రంబులబో ధించి నినికెట్టి భయంబుగలుగక సుఖంబుగమీయూరికిపోయి చేరుదువు గాకయనిదీవించి యామెయంత తనయాశ్రమంబున బండి వెడలనంపె.

అంత ప్రభావతి యమ్మునివరునిచే ననుజ్ఞాతయై అశ్వంబునెక్కి సురక్షితంబుగ మగధదేశంబునకుంబోయి యూరువెలపల అశ్వంబుడిగ్గి మగలవస్త్రాభరణంబుల నలంకరించుకొని యాపట్టణంబులనువాడువారల నాయూరిపతియెమానంబువిచారింపగా శత్రువెలుకంబవచ్చితమదేశంబును పట్టుకొనియేలుచుండ నట్లును, చిత్రకరుండును మతిభ్రమణంబున పిచ్చివా డయితిరుగుచునన్నడనియు నవిని తత్క్షణంబున పతిచరణారవిందంబులడెం

దంబునఁగిడి ప్రణామాంగంబునకు పంచాక్షరంబు నొక్క రాణి సూరాయు
స్త్రంచినమాత్రంబునఁ గోట్లకలది రథగజతురగపదాతులును, పరశుపట్ట
సశూల ముసలఖడ్గకుంత తోమర కోదండాదిశరాయుధంబులును సృష్టి
యయ్యె నంతశత్రురాజు అట్టివాహినులం బోలువాహినులం గని బలవంతు
డెవ్వఁడో తనపురంబునకు నండె త్రివచ్చెనని తలంచి కాలుసేతులు తడబడ
జిక్కిలి భయాక్రాంతచిత్తుండై యాక్షణంబున సపత్నీపుత్రమిత్రబాంధ
వులతో కలుములన్నియుఁ బాసి పరాజితుండయ్యె.

అంతట ప్రభావతి నిర్భయంబుగా పురంబులోనికిఁ జొచ్చి రాజసూ
తియుండు మేడకుం బోయి ఆమెకు నమస్కరించి తనవర్తమానంబును
దనప్రాణనాథునికిఁ దెలియం జెప్పె. చెప్పినంత యామె ప్రభావతిం జేరదీసి
శాంతిగూర్పం బట్టుకొని ముద్దిడుచుండు నోతల్లీ, మాకులదీపమా,
పతివ్రతారత్నమా, విచారపడవలదని ధైర్యంబు జెప్పి పరదేశరాజుచే
తం పట్టణముగోల్పోయి తాముబడరానిబాములపడుచుండుటయు చిత్ర
కరుండు తాచేసినదుష్కృత్యంబు తలచితలచి ఖిన్నుండయి పిచ్చిపట్టినవాడై
తిరుగుచుండుటయు మొదలగు తమకష్టంబులనెల్ల జెప్పె. చెప్పగానే ప్ర
భావతి తక్షణంబున చిత్రకరుండున్నయెడకుం జని యతని చరణారవిందం
బులకు మ్రొక్కెడి పాతివ్రత్యప్రభావంబున నతని మతిభ్రమణంబుకు బో
గొట్టి యామెచే నతనికి పట్టముగట్టించి వివిధోపచారంబుల నతని సంతోష
బెట్టుచు ముల్లోకంబులు నిట్టిపతివ్రతాతిలకంబు నుం గలదాయని కీర్తి
బడసి పెక్కువేలసంవత్సరంబులు ధనకనక వస్తువాహనంబులు మొద
లగు అష్టయిశ్వర్యంబులం దులతూగి తుదకు భర్తసహగమనంబు గా
వించి యెట్టివారికి నందరాని కయివల్యపదవిం బొందె.

అనగా యింతులు తమతమపతులను దైవంబుగా దలచి వారికెవ
ర్కొనక వుచితంబులే చేయుచు హితంబులు బల్కుచు గారవంబులు జూ
పుచుయుండుటే పతివ్రతలకు సూటియని యెఱుంగవలయును.

ప్రభావతీదేవి ప్రభావము - ముగిసెను.





శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యము



# శ్రీ భక్తవిజయము.

## 18 సుముఖీదేవి ప్రభావము.

పూర్వంబు సింహపురికిఁ జేరువ ప్రాంతంబున కుమ్మరపల్లెయొకటి కలదు, అందు శుద్ధసాధుండను కుమ్మరయొకఁడు కలడు. అతఁడు అనేక దినంబులనుండి బిడ్డలు లేక లేక ముదుసలి ప్రాయంబున నొక పుత్రింగని యుంచె. దానిముఖంబున శోభనరేఖయొప్పియుండుటం జేసి యాబిడ్డకు సుముఖియను పేరుబెట్టి మిక్కిలి గారాబంబుతో పెంచుచునుండిరి, ఆ సుముఖి చిఱుతప్రాయంబునుండి తలితండ్రులకు ముద్దునూపుచు శాంత శమదమాది సుగుణంబుల నభ్యసింపుచు వారిమాటలజవదాటక తన యీడు బాలికలతో నాటపాటలం బ్రొద్దుపుచ్చక గృహకృత్యంబుల నెల్ల నొప్పుగఁ జేయుచు శుద్ధసాధునిపుత్రి లోకంబులోన బిడ్డవలె తన యీడు వారలం గలసి మాట్లాడదు యెవరితో ముద్దుముద్దుగ మాట్లాడక యున్నా దంబు పట్టినదానివలెనుంటున్నది. ఇన్నాళ్ళకు సెలవుగా మంచిమాదిమి ప్రాయంబునఁ బుట్టక నేటికాలని! అతవికటువంటి బిడ్డ పుట్టవలెనా? ఇట్టి

బిడ్డయుండియేమి లేకయేమి దీనినెవరు పెండ్లి జేసుకొందురు సుమీయని వారందరు జెప్పుకొనుచుండిరి.

అట్లు చెప్పుకొనుచుండు మాటలనాకర్ణించి యీపుత్రికచేష్ట యునట్లుండుటంగని చింతాక్రాంతచిత్తుడయియీశ్వరా, యిట్టిముద్దుపిల్ల మనకుపుట్టవలెనా, ఇట్టిదానికి నాప్రాణమున్నపుడే పెండ్లి చేయుటయుం చిది. నావెనుక దీని నెవరు పెండ్లి చేసికొనరని తలచి తనబంధువులలో చక్కనివాని నొకని దెచ్చి యాకుమారుని నతనికిచ్చి వివాహంబొనర్చి తనకు మొగబిడ్డలు లేనందున వానినే పుత్రునిగాభావించి తన యింట

తనకు మొగబిడ్డలు లేనందున వానినే పుత్రునిగాభావించి తన యింట

బెట్టుకొని ప్రేమతో పోషించికులవిద్యయగుకులాలకవృత్తి నేర్పుచునుండె. కొన్నిదినములకు శుద్ధసాధుండు మృతిబొందె, అంతట సుముఖి భర్తకా యగుమందప్రజ్ఞుడుభార్యంజూచి యోసీ! మీనాయనబ్రతికియున్నంతవఱకును మన కేమివిచారము లేక నతనిసంరక్షణవల్ల మిక్కిలి గారాబముగా కాలము గడుపుచుంటిమి. అతడు మనదురదృష్టంబున కాలగతిబొందె. నీవుమం దబుద్ధివి. నేను మందప్రజ్ఞుడను. ఏపనిపాటు లేక మునుపటివలె నున నూరకయుంటిమేని మనలపోషించువారొక్కరు లేరు గనుక నీవసలు గురితోపాటు మనబంధువులతోడంజని పూరివెలుపలనుండు మంచిజిగ టమన్నగంపలనెత్తుకొనివచ్చితివేని నేనీకుండలు మొదలుగునవి చేసి వా టనివిక్రయించి దానిచేతనసంసారకృత్యము జరుపుకొనవచ్చునని పల్కె. పలుకగానే సుముఖి భర్తయనుమతిచొప్పున బంధువులతోడంజని మంచి జిగటమన్నగంపలనెత్తుకొని ప్రతిదినము తెచ్చి యిచ్చుచుండగా మంద ప్రజ్ఞుడు భాండాదులంగావించి దానివల్లజీవించుచుండెను. అట్లుండగా నొక్కనాడాసుముఖి మట్టిగంపనెత్తికొనివచ్చునెడ బరువుమోయలేక తటాలునక్రిందపడవయిచి యత్యాకసం గూర్చుండి యీశ్వరా, యింత బరువు నేమోయలేనే యీమట్టిపోనిదిగాని యింట నతనిపని జరుగదే యని యేడ్చుచుండెను. అట్లు యేడ్చుచుండు దాని కూడవచ్చిన బం ధువులయినను నాదరింపరయిరి, తిరిగిచూడకనుం బోయిరి.

ఇట్లుండగా సుముఖిచే భాగ్యవశంబున నకస్మాత్తుగాయాదారిని గౌతమమహర్షి వచ్చుచుండి యాఏడ్చుదానింగాంచి యేలయేడ్చెదవు నా

విశ్రమించి వేగముననింటికివచ్చి వచనముగావించి మగనికన్నంబిడి గో తినుమనిప్రేమండానలెచ్చిన భోగాసనముల నభ్యసింపుచు పతిపదారవిందముల భగవన్నామస్మరణముతో జపించి పిదపపతిభుక్తాన్న శేషం బుగుడిచి యతనికనుకూలమగు పనుల జేయుచునుండెను.

ఒక్కనాడట్టిసుముఖి యెప్పటివలె స్వజాతిస్త్రీలంగూడి మున్నదెచ్చుటకుబోగా దారిననొకపెన్నేటిప్రవాహంబడ్డంబై వీరలంబోనియక నడ్డపడగా తెలుపక్కరస్త్రీలందరు విచారగ్రస్తలై ఓయక్కా! ఓచెల్లి! ఓపిల్లా! ఓవదినా! ఈవేళచీకటిలోలేచి ఎవరిముఖముచూచితిమో వారిమొఖాన మొస్తలుపెట్టాయని తిట్టుకొనుచు మఱలతమతమయిండ్లకుబోవ నుద్యుక్తమైరి. అట్లుండగా నాసుముఖియట్టివారింజూచి అక్కలారా! మీరేల విచారపడెదరు. నాతోటి నిర్భయముగరండని పతివ్రతాప్రభావమున నాయేటివెల్లువలలోదిగానంతలో యీమెమహాత్మ్యమునకుమెచ్చి యానేటివెల్లువరెండుప్రక్కల ప్రత్యేకంబుగనిలిచి నడుమనిర్జలోకెబోవ దారినిచ్చె. అంతనాస్త్రీలు సుముఖితోడంగూడి చని బంకపట్టి నెత్తుకొని యీమెపాతివ్రత్యప్రభావంబున కాశ్చర్యపడి అనేకవిధంబులం బొగడుచునింట్లవచ్చిచేరి యీవర్తమానమును యూరివారలకుం దెల్పగావారందఱు సారా! సుముఖిచిన్ననాటనుండి అంతమొద్దుగా, మూగగానుండెగదా, అట్టిదాని కెట్టిసామర్థ్యముగలిగెనని చోద్యపడుచుండగా నావర్తమానము కులాలకులమునకొక పెత్తనగాడగు పెద్దశెట్టికిం దెల్పియతడు తనభార్యయు మిక్కిలి యాశ్చర్యపడి ఆమె ప్రభావము పరీక్షింపం దలచి యీపెద్దశెట్టి యొక్కనాడు కొందరు కుమ్మరస్త్రీలను సుముఖియింటికిబంపి ఆ యూరిదేవునికి ఉత్సవంబు జరుగుచున్నది దేవునిచూచివత్తము కొల్లవేడుకగానున్నది. పోయిచూచి వత్తమురమ్మా అని పిలువుమని పల్కి పలుకగా వారలామెను అట్లు పిలచిరి. అట్టిసమయంబున నామె తన పురుషునికి యుపచారముచేయుచుండి తల్లులారా! నాకు రాదీరదు. నా దేవుడు నాయింటనేయున్నాడని వారినివెడలనంపె. వారు మఱలజని యీవర్తమానమునతనికెఱుంగింపగా ఆ శెట్టి మిగుల యాశ్చర్యంబొందె.

అట్లుండగా మఱియొకనాడు ఆయూరిరాజు యీసుముఖిదేవతి

కుండలు తెచ్చియిచ్చు కుమ్మరిది రాగా నే కుండలు
నిరూకలనియ్యక దానితో నీమాట ఆమాట మాట్లాడి మూ
...నములవరకు ప్రొద్దుపుచ్చుచుండుమని ప్రభువు తన కెఱింగింపుమని
పలికినట్లు జెప్పె' అంత నా పట్టపుదొరసాని మరునాడుదయమున నాకుమ్మ
రిదికుండలు తేగా బేరమాడి భాండములం గొన్నిపుచ్చుకొని వాటిక్రయ
మియ్యక నా సుముఖింజూచి తల్లీ! నిన్ను లోకులందరు చిన్ననాటనుండి
మిక్కిలి మందమతియనియు, మూగయనియు వాడుకొనుచుండిరిగదా!
అంతంతవర దేవతలలోలె అనేకయద్భుతకార్యములం జేయుచుండెదవు.
నీకిట్టిమహిమ యేవిధముననగలిగెనో చెప్పుమని యనేకవిధములనామెను
పొగడుచు ఆ సుముఖివలన పతివ్రతాధర్మము తెలుసుకొనుచు ననేక విష
యంబుల మాటలాడుచు ప్రొద్దుపుచ్చుచుండె.

అట్లుండగా సుముఖియారాణింజూచి తల్లీ! చాలా ప్రొద్దెక్కెనది?
ఝామున్నర ప్రొద్దాయె నాభర్తయింటియందు మిక్కిలి యాకలిగావి
యుండు. త్వరగా నేనింటికింజని వచనముగావించి యతనికన్నమారగిం
చవలెకావున నాభాండములమూల్యంబునిచ్చి నన్ను వెడలనంపవమ్మా
యనిపలికె. అట్లడిగియు నాదేవియిదో నిచ్చెదనని కాలయాపన
మొనర్పుటంగని నేడఝామున్నరకు సరిగానింటికిపోవలెనవితలచి యా
క్షణంబున నాతిపదారవిందములనాత్మందలచి సూర్యునిప్రతిదినమట్లుసం
చరింపనీక నిలిపి నిలిపె. అట్టిసమయమున నాభూమియందు ఘటికాయం
త్రము దాపుంబెట్టుకొని ఘడియలు లెక్కపెట్టుకొనుచుండగ నప్పుడు
మూడున్నరఝామంబు ప్రొద్దెక్కె అట్లుప్రొద్దెక్కియు సూర్యుని నీడ
ఝామున్నరకాలముననేయుండె. ఉండగా రాజు అట్టి యద్భుతంబుగని
నామె పతివ్రతాప్రభావమునకు సంతోషించి సూర్యునియుటువటుకదల
నియ్యకుండుటకయిమెచ్చియామె కేవలము శుద్ధబ్రహ్మస్వరూపంబని భా
వించి యాక్షణంబున నవమణిమయంబులగు పల్లకిలోనంగూర్చుండబెట్టి
భేరీభాంకారాది ధ్వనులు మిన్నుపిక్కటిల్ల మ్రోయుచుగా మహోత్సవం
బున నావట్టణ్యవతకే యూరేగింపు గావించి ధనకనకవస్తువాహనంబులు
మొదలగు కానుకలతో నామెను తనయింటవదలి మందప్రజ్ఞవాలింగ
నముచేసికొని. యనేకవిధములంగొనియాడి యాదినము మొదలు జీవిత

శ్రీ భ ...

కాలమునకరకు వారల కెట్టి కొరతయు లేక నన్ను-
చుండెను.

అంతట నా సుముఖీ దేవి మందప్రజ్ఞుం గూడి అనేకదినములు భూలోకమున సకలభోగభాగ్యములనుభవించి ప్రాణావసానకాలమున పరమపదవింబొందె. గావున సాత్రాజితీ, నీవు నట్టిపతిభక్తి సేయుకరకసతిపి అతని మనంబునకు ప్రియంబును సంతోషమును కలిగించుచుండు వేని నీవు సుముఖీదేవిప్రభావముకంటె నతిశయించిన ప్రభావముగలదానవై యిహలోకమునందెల్లవారిచే సత్కీర్తివడసి పరలోకమున శాశ్వతబ్రహ్మానంద పదవింబొందె మహాత్మ్యాఖ్యాంబుధినోలలాడుచుండెదవనిపలికె. పలుకగా సత్యభామ పాంచాలింజూచి వదినా! నీవు పాలిటిపరబ్రహ్మస్వరూపము గాకుండువేని యిట్టి పరమపతివ్రతాప్రభావములన్ని నెరుంగ నేర్తునే, ఆహా, నీమహిమ నేమందును. తల్లీ, యట్టిపుణ్యకథాశ్రవణంబున నా చెవులకింపుపుట్టించె. నాచిత్తమునకు పరమానందంబయ్యె నాయాశాపాశము లనుభవబంధములును యొకటొకటిగనూడి పరమపదవికింబోవుట కొక్కొక సోపానపుమెట్లు ప్రాప్తమయ్యె. నేనింతకంటె మించిన సుకృతంబును మఱియొకటి సంపాదించవలెనేని నాయమ్మా, ఇక నవ్వలి కథావృత్తాంతమును సాంగోపాంగముగ నెరిగించి నా యజ్ఞానంబుడిపి ధన్యురాలం జేయవేయని వేడుటయు.

అనగా యింతులు తమతమ పతులను దైవముగాదలచి వారికెదురాడక నకవుచితము లేజేయుచు హితంబులు లుకుచు గారవములు చూపుచుయుండు లే పతివ్రతలకు నూటియుని యెఱుంగవలయు.

సు ము ఖీ దే వి ప్ర భా వ ము.

ము గి సె ను.



శ్రీ ర స్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## 19. పుష్పవేణీదేవి ప్రభావము.

సత్యా! పుష్పవేణిప్రభావము జెప్పెదవినుము. ఇదికడపటికథ. దీనిని అనన్యచింతానసక్తురాలవై వినుము. పూర్వకాలమందు చోళదేశమునకు ముఖ్యనగుపట్టణంబొకటికలదు. దానిఁగాంచీపురమనిపలుకుదురు, అమ్మహాపురంబును పుష్పరథుండనుజనపాలుండు పాలించుచు అట్టిపుష్పరథునకు చిరకాలమునుండి బిడ్డలులేక తద్దయుంజింతించిఅట్టిపురమున శ్రీ మత్కామాక్షీ సమేతుడయి నెలకొనియుండు యేకాంబరనాథస్వామిగూర్చిస్వధర్మపత్నీసహితుడయి దీర్ఘతపంబొనర్చుచుండెనట్లుండగానాదంపతులతపప్రభావమునకుమెచ్చి యొక్కనాడేకాంబరనాథుండు కామాక్షీసమేతంబుగ వృషభవాహనారూఢుండై వారిముందరగల ప్రత్యక్షమైవచ్చి నిలిచి ఓపుణ్యశీలులారా, మీమీతపప్రభావంబునకె మెచ్చితి. ఇక తపముచాలింపుడు. మీకేవరమువలసినవారయి తపంబుం జేసిరి దానిసెలవీయింపుడు. మీమనోరథం బవశ్యంబు దీర్తునని తత్కరుణాలోకనకారయిత్త్యమృతబిందుసందోహములన త్రపాపహిన్నం జల్లాచ్చుచుంబలికె పలుకగా నవ్వధూవరులు ఆపధ్వజులకు సాష్టాంగదండప్రణామములాచరించి నానావిధములఁబొగడి యంజలిబద్ధులైనిలిచి యోవేల్పులారా! పెద్దకాలమునుండి మే మనపత్యమయియుండుటంజేసి మాకొకపుత్రునిం దయసేయుండని ప్రార్థింపగా బరమేశ్వరుం డానతిపతులంగని మీకొక్క పుత్రిక పుట్టునని బల్కినతోడ నీశ్వరీసహితముగ నదృశ్యుండయ్యె. అంత నయ్యేకాంబరనాథు ననుగ్రహమున వారలకొకపుత్రిక జనియించె. దానికి పుష్పవేణియనిపేరిడిమిక్కిలి గారాబమున బెంచుచు వేదశాస్త్రపురాణేతిహాసధర్మములనేర్పించుచు నత్యంతప్రేమాతిశయముం బూనుచుండగా ఆకన్యకకుయౌవనమంకురించి అంతఃపురమునుండె.

స్త్రీ భ

అట్లుండగా నొక్కనాడు ఆరాజుకడకు .
ఋషివచ్చి యతనిచే సత్కారమువడసి యుచితపీఠముసం గు
రాజునందీవించి కుశలమేయని యడుగగా నతండు మునీంద్రా! మీవంటి
తపోధనులనుగ్రహముండ కొదువయేమని వచించి, అమ్మునీంద్రునితన
చెంత కొన్నినాళ్ళునిలువుకొని యొకనాడు తనపుత్రియుండు అంతఃపుర
మునకుబంపెను. పంపగా నక్కుమారికయమ్మహర్షికింగని మ్రొక్కి వినుతి
గావించి మధురాయమానములగు పదార్థముల నతనికి భుజింపబెట్టి వివి
ధోపచారముల నతనికిప్రీతిపుట్టించుచు మహాత్మా! పామరులగుస్త్రీలకుం
యెవ్విధమున బతిప్రతాప్రభావం బలవడియుండును. ఆత్మజ్ఞానోదయం
బెవ్విధమునం గలుగు. దానినాకెఱుంగంబలుకవే మహాత్మాయనిప్రా
ర్థింపగా నతండిట్లనియె.

వినవే గుణభూషణీ! లోకమునందు గుణవతులకుతమతమ భర్తలే దైవ
సమానులు కావుననేయువతి, ప్రతిదినము తెల్లవారకమున్న మేల్కొని
లేచి భర్తచరణసరసీరుహముల ధ్యానించి జలకములాడి శుద్ధమగువలు
వంగట్టుకొనిమొ బతిచరణములకు నమస్కారములొనర్చి యంతనింటంగలపా
చిపనులెల్లందీర్చి మరలప్రాణేశ్వరుపాలికేగి ఉంతమేల్కొనునంతప్రమొ
క్కుదవియర్ఘ్యపాద్యాదివిధులబూరించి అతనియనుమతిగొని వంటశా
లకుబోయి ఆతనిమనసునకు ప్రియమగు భోజనపదార్థముల నాయత్త
పఱచి వేళతప్పకనతనికన్నమిడి వారిమాటకెదురాడక ప్రీతిబుట్టించుచు
సదాభర్తృచరణారవింద ధ్యానము చేయుచుండునేని అట్టియువతికి ఆత్మ
జ్ఞానోదయముగలుగు. సాధ్వీ అట్టియాత్మజ్ఞానోదయంబుగుణం బానతిత్తు
వినుము. మానవులకు జీవితకాల మల్పమ్మె ధనకనకవస్తువాహన పుత్ర
మిత్రకళత్రాది సంసారయోగమువదలుటంబట్టి మోక్షసాధనమున
కనేకవిఘ్నములు పొసగుచుండు అని మోక్షసాధనం బోధించె.

అంతటనొక్కనాడు పుష్పరథుండుపుష్పవేణికి వివాహముజేయం
దలచినానాదేశ రాజపుత్రులస్వరూపపటములం దెప్పించిపరికింజూపె.
జూపగానాకన్నియ పటములనన్నిటి జక్కగాజూచి నిస్పృహయైత్రోయుచు
కడకుమాళవదేశరాజకుమారుని పటముపిలకించి బ్రహ్మానందపరవశ్రయై
సిగ్గుపడి మోహమువాంచిచిత్రపుబొమ్మచోలె యూరకుండె. అప్పుడతడు

ఎంతే పురమునకసఁచి పేరోలగంబుండి పురో
యతనింగని నమస్కరించి భూసురోత్తమా! నాపుత్రి
పుష్పవతి యౌవనారూఢయై యుండుటంజేసి యికనింటబెట్టుకో
నుటపాడిగాదు. దానంజేసి యకన్యకయకు దాంపత్యంబొనర్పదలచియుం
డుదాన. సుముహూర్తంబొక్కటినిరయింపుడుఅనిపలికి అట్టిశుభరేఖను
దక్షిణమున సకలవిద్యావిశారదుడగు నొక్కపారునిచే మాళవదేశపా
మినికినంపె. అంతనామాళవదేశాధీశుండా శుభపత్రికంగొనిపుత్రుడగు
సుప్రకాశునకుచూపి వివాహమునకుం దగిన వస్తువులం గూర్చుచుండె.

అట్లుండగా సుప్రకాశుం డానరేంద్రునిజూచి తండ్రీ! త్రిమూర్తు
లగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నంతము తమ యిల్లాండ్రనెపెబాసి
యుంటిమేనివారెట్టి యపఖ్యాతి దెచ్చురోయను భయముచేనీశ్వరుసుజటా
జూటమునందును, విష్ణువక్షమందును, బ్రహ్మనాస్యమందును బెట్టుకొని
యుండెదరు. లోకమునబతివ్రతాశిరోమణియనగు సతిలభించుటదుష్క
రము కావుననాకుబెండ్లియక్కఱలేదనిపలికి పట్టినపట్టువదలక తెమనుం
త్రికుమారుడగు సునీతుండోడ్కొని యుత్తరదిశంగూర్చి నయినవ్వెబోవుచు
పోవుమార్గమున మృగముల వేటాడుచు కందమూలఫలనగ్రముసం దిను
చుమహాతపోధనులందర్శించుచు అట్టిమహాత్ములచెంతజని మునులారా!
నన్ను మీశిష్యులలోనొక్కనిగాగయికొనరేయని వేడుచు, తుదకు అచ
లుండురు నొక్కమహాముని నిలయమునకుంజని యతనింగాంచినమస్క
రించి యనేకవిధముల నుపచారములొనర్చుచు మంత్రికుమారుంగూడి
అనేకదినములు శిష్యవృత్తిచేసకుండని తన్మునివరుండుమెచ్చుకొనునట్లు
నటించి అతనిచే వేదవేదాంతాది పరవిద్యాము లెల్లంగొనుచుండె,

అట్లుండగా నచట పుష్పరథమహారాజు మాళవదేశాధీశ్వరుండు
తనకంపిన ప్రత్యుత్తరమునుజూచి విచారపరుడై పుత్రింజూచితల్లీ! మన
మంపినవివాహపత్రిక చేరకముందే సుప్రకాశుడుతనకువివాహమక్కర
లేదనివిరక్తిబొంది మంత్రికుమారుడగు సునీతితోడ గూడి చాంద్రా
యణముచరింప బోయెననిమనకనన్నివెప్పెననిపల్కె యాకన్యకుపుత్రికజే
నిచ్చె. ఇయ్యదిగా నాకొన్నగూరాకపోవుజదివి తెలిసి... బిదనసి
జనకులారా, నేనిక నా భర్తయగు సుప్రకాశునివెదకి ఉదా...నున్నా

ప్రకాశుండుపుష్పవేణిని, మంత్రికుమారుండగు సునీతిని
నలట్టినమరసైన్యంబులతో అచలగురువుచెంతకున్జసియతనికినమ
రించి జరిగినవర్తమానంబంతేయు నాదిమధ్యాంతంబులుగ యతనికె
జింగించిఅతనిచే సెలవన్ది అచ్చటనుండికదలిన ప్రకాశుండును, పుష్పవేణి
యు, సునీతియుక్తోలాహలంబునసకలసైన్యములతో వచ్చుచుండిరి. అట్లు
వచ్చుచుండువారలవర్తమానమునుచోళదేశపురాజుచారులచేవిని భూరి
భాంకారాదిగోప్పధ్వనులతో రథగజతురగపదాతులతో నెదుర్కొనిబ్ర
హ్మానందంబున తనపురంబునకుందోడ్కొనివచ్చి పుత్రికననేకవిధంబులం
గొనియాడియామెమహత్వంబునకుమెచ్చి బ్రహ్మానన్దపరవశుండై యుండె,
అట్లుండగా మాళవదేశాధిపతితనపుత్రుడగుప్రకాశున్గూర్చి తన్నో
డచోళభూపాలుచెంతనుండుటనెఱిన్గిచతురంగబలములతో వేణువీణాపన్య
దనాదివాద్యవిశేషంబులతో సకలబన్ధుపురోహితవిద్వజ్జనకవిగాయక వం
దిమాగధులతో చోళదేశంబులకుజనిసుప్రకాశుంగనియానన్దించిఅతనివల
నపుష్పవేణివర్తమానంబును దూరాక్షనవిన్కొలిసింజెరదీసి దీవించి
తల్లీ ఇంతచిన్నప్రాయంబుననేనీకిట్టిపతిభక్తికలిగియుండుట మేముచేసిపు
ణ్యము ‘‘భళిభళి’’ పుష్పవేణీపతివ్రతాశిరోమణి? సుగుణభూషణి? మా
తల్లి! మావంశమునిల్పిమమ్ముద్దరించితివి. ఇట్టిప్రభావముగల సినుమాకు
కోడలగుటయేమాభాగ్యము. జన్మసాఫల్యంబయ్యె. అని యనేకవిధముల
గొనియాడిచోళభూపాలునికౌగలించి పరమానందమున ప్రియవచనంబు
లాడి భూపాలా? ఇకశోభనోద్యోగంబు సేయింపుము అనియానతిచ్చె.
అంత నామాళవరాజు పురమునలంకరింపజేసి సుముహూర్తము
నపుష్పవేణినిసుప్రకాశునకిచ్చి వివాహంబొనర్చి కొన్నిదినంబులు కూ
తునల్లుని దమయింటబెట్టుకొని వెనుక అల్లునకు చతురంగబల ధనకనక
వస్తువాహనాదుల అరణంబొసంగి పుత్రికారత్నంబును నసంఖ్యాకంబులగు
వివిధపదార్థంబులగంతపెట్టి భూరిమంగళవాద్యంబులతో విప్రాశీరవం
బులతో నృత్యగీతవాద్యవిశేషంబుల వారలనెడలనంపె. అంతనా సు
ప్రకాశుండు పుష్పవేణితోడ తనపురంబునకుంజేరి కొన్నిదినములకువె
నుక పట్టాభిషిక్తుండై యనేకదినంబులవరకు రాజ్యపరిపాలనం బొనర్చి
అష్టయిశ్వర్యంబుల ననుభవింపుచుండె. పుష్పవేణియుపతిపూజాదురం